అరవయ్యేళ్ళుగా యువభారతి చేసిన సాహితీ కృషిని చిరస్థాయిగా ఉంచడానికి, మా ప్రచురణలను అన్నింటినీ Scan చేసి Internet లో ఉంచడమే కాక, వాటి QR Code లను ఈ పుస్తకంలో ఒక్కొక్క ప్రచురణతో పాటు ఇచ్చాము.

మీరు చదువుదామనుకున్న పుస్తకం యొక్క QR Code ముందు మీ మొబైల్ ను ఉంచి, ఆ Code ను Scan చెయ్యండి.

మీకు archive.org అన్న blue colour link కనిపిస్తుంది.

ఆ link పై నొక్కి, ప్రచురణను ఉచితంగా చదువుకోవచ్చు.

అలాగే ప్రచురణను download చేసుకుని మీకు వీలున్నప్పుడు చదువుకోవచ్చు.

సాహితీ ప్రియులైన మీ బంధుమిత్రులకు ఈ పుస్తకాన్ని కానుకగా ఇస్తే, యువభారతి ప్రచురణల భాండాగారాన్ని వారికి బహూకరించినట్లే...!! ఈ పుస్తకాన్ని కొనతలచిన వారు ఈ క్రింది నెంబర్లకు ఫోన్ చేసి సంప్రదించండి.

**98499 09896** లేదా **93913 73684**

# ద్విశత భారతి

యువభారతి ప్రచురణల సంక్షిప్త పరిచయం

**పత్రి అశ్వనీ కుమార్**



**యువభారతి వజ్రోత్సవ ప్రచురణ**

# ద్విశత భారతి

(గత ఆరు దశాబ్దాల కాలంలో యువభారతి ప్రచురించిన
200 ప్రచురణల సంక్షిప్త పరిచయం)

పత్రి అశ్వనీ కుమార్

ప్రచురణ

యువభారతి

(రి. సంఖ్య 1 / 64)

తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు

తిలక్ రోడ్, హైదరాబాద్ – 500 001

Dwishata Bharathi

A brief introduction of the 200 books published by Yuvabharathi over the past 60 years - by Patri Aswani Kumar

© YUVABHARATHI

ప్రచురణ సంఖ్య : 201

ప్రథమ ముద్రణ : డిసెంబర్ 2022

ముద్రణ సహకారం : 'పుస్తక శిల్పి' తాళ్ళపల్లి మురళీధర గౌడ్

ముఖచిత్ర రూపకల్పన : నవ్య ప్రింటర్స్,
మోతీ నగర్, హైదరాబాద్ – 500 114

డి.టి.పి. & లే ఔట్ : అనన్య గ్రాఫిక్స్
నవీ ముంబాయి, మహారాష్ట్ర

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
విద్యానగర్, హైదరాబాద్ – 500 004

ప్రతులకు : యువభారతి
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాద్ – 500 001
చరవాణి : 98499 09896
93913 73684

వెల : రూ.100 /-

పద్య కళాప్రవీణ, కవి దిగ్గజ
డా. ఆచార్య ఫణీంద్ర
(తెలుగు విశ్వవిద్యాలయ "కీర్తి పురస్కార" విజేత)
అధ్యక్షులు, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ

# "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం?"

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న సూక్తి స్ఫూర్తితో - "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ - తెలుగు నాట సామాజికోపయుక్తమైన అనేక సత్సాహిత్య కార్యక్రమాలను నిర్వహించే తలంపుతో, 1963 సంవత్సరం విజయదశమి నాడు భాగ్యనగరంలో ఆవిర్భవించింది. తెలుగు సాహిత్య రంగంలో ఒక విశిష్టమైన, ప్రశంసాపాత్రమైన స్థానాన్ని సంతరించుకొన్న "యువభారతి" సంస్థ ఈ 2022 విజయదశమి పర్వదినం నాటికి 59 సంవత్సరాల సుదీర్ఘ సేవను పూర్తి చేసుకొని 60 వ సంవత్సరంలోకి అడుగిడింది.

ఈ అరవయ్యేళ్ళ ప్రస్థానంలో యువభారతి సంస్థ - సత్సాహిత్యపఠనం సమాజంలోని పౌరులలో సౌమనస్యం, సౌశీల్యం పెంపొందించేందుకు దోహదపడుతుందని విశ్వసిస్తూ, అనేక సాహిత్య ప్రసంగ కార్యక్రమాలను నిర్వహించింది. ఆ కార్యక్రమాలలో ప్రాసంగికులుగా అలరించిన మహనీయులు ఎందరో -- కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీ, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా. దాశరథి, డా. వానమామలై వరదాచార్యులు, డా. పుట్టపర్తి నారాయణాచార్యులు, కాళోజి, ఆచార్య సి. నారాయణ రెడ్డి, గుంటూరు శేషేంద్ర శర్మ, డా. ఇరివెంటి కృష్ణమూర్తి, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, డా. తిరుమల శ్రీనివాసాచార్య -- ఎందరెందరో ...! వారందరి ప్రసంగ పాఠాలను ఎప్పటికప్పుడు అక్షరబద్ధం చేసి, గ్రంథాల రూపంలో ముద్రించి, వాటికి శాశ్వతత్వం చేకూర్చిన సౌభాగ్యం, ఘనత "యువభారతి" సంస్థది. వీలైనంత ఎక్కువ విలువైన సాహిత్యాన్ని, వీలైనంత తక్కువ వెలకు అందించడం "యువభారతి" ఆశయంగా నిలిచింది. స్వాతంత్ర్యానంతర తెలుగు సాహిత్యాన్ని విశ్లేషించిన 700 పుటల "మహతి" గ్రంథాన్ని ఆ రోజులలో 7 రూపాయలకే అందించిన విషయం తెలుగు సాహిత్యాభిమానులందరికీ విదితమే! ఆ "మహతి" కి కొనసాగింపుగా - "యువభారతి" ఇటీవలే ఈనాటి పండితోత్తములు, విమర్శకాగ్రేసరులతో వ్యాసాలను వ్రాయించి, "అమృత భారతి" పేరిట ఒక గ్రంథాన్ని వెలువరించింది. ఇది "యువభారతి" ప్రచురించిన 200 వ గ్రంథం.

ఇప్పటివరకు "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ - పండితోత్తములచే, సాహితీవేత్తలచే విశిష్టమైన, అమూల్యమైన ద్విశత గ్రంథాలను వ్రాయించి, ప్రచురించి, ప్రజాబాహుళ్యానికి ఉపాయనంగా సమర్పించి, సహృదయ పాఠకుల మన్ననల నందుకొన్న విషయం సర్వ జన విదితమే!

ఈ గ్రంథకర్త శ్రీ పత్రి అశ్వనీ కుమార్ గారు "యువభారతి" సంస్థ వరిష్ఠ సభ్యులు. ప్రస్తుతం ఆయన ముంబై వాస్తవ్యులైనా, నలభై ఏళ్ళుగా ఆయనకు "యువభారతి" తో

చక్కని సాన్నిహిత్యం, అనుబంధం పెనవేసుకొన్నాయి. తాను ఎంతో అభిమానించే "యువభారతి" ప్రచురించిన గ్రంథాలన్నింటి వివరాలను ఈనాటి సమాజానికి, ముఖ్యంగా ఈనాటి యువతకు పరిచయం చేయాలన్న సదుద్దేశ్యంతో ఈ గ్రంథ రచనకు పూనుకొన్నారు. "యువభారతి" ముద్రించిన గ్రంథాలన్నీ ప్రసిద్ధి చెందినవే .. విమర్శకుల మన్ననలందుకొన్నవే .. పాఠకుల హృదయాలను దోచుకొన్నవే!

"కావ్య లహరి", "చైతన్య లహరి", "వికాస లహరి", "ప్రతిభా లహరి", "వేద విజ్ఞాన లహరి", "ఉపనిషత్సుధా లహరి", "సంస్కృత సాహితీ లహరి", "జగద్గురు సాహితీ లహరి", "రామాయణ సుధా లహరి" వంటి "లహరి" ప్రసంగ పాఠాల గ్రంథాలైనా; "శ్రీనాధుని కవితా వైభవం", "తిక్కన కవితా వైభవం", "తిమ్మన కవితా వైభవం', "ధూర్జటి కవితా వైభవం","తులసీదాసు కవితా వైభవం", "నన్నయ కవితా వైభవం", "మందార మకరందాలు", "వేమన్న వేదం", "విశ్వనాధ కవితా వైభవం", "దాశరథి కవితా వైభవం", "విశ్వనాధ సాహితీ సమాలోచనం", "నారాయణరెడ్డి సాహితీ మూర్తి", "మహతి", "అమృత భారతి" వంటి అన్ని తరాల తెలుగు మహాకవుల సాహిత్య వైభవ విశ్లేషణా గ్రంథాలైనా; "సరస్వతీ సాక్షాత్కారం", "నా గొడవ", "ప్రజా సూక్తం", "వాగ్భూషణం భూషణం", " దేశమును ప్రేమించుమన్నా!", వంటి విశిష్ట సాహితీ గ్రంథాలైనా -- అన్నీ తెలుగు సాహిత్యాన్ని సమగ్రంగా మథించి ఆపోశన పట్టేందుకు ఉపకరించే ప్రామాణిక గ్రంథ రాజాలే! యువభారతి గ్రంథాలన్నీ ఒక్కొక్క ప్రతి మనఇంట్లో ఉంటే అదే ఒక మహత్తర, బృహత్తర గ్రంథాలయమౌతుంది.

అలాంటి గ్రంథాలన్నింటిని పరిచయం చేస్తూ చేసిన లఘు సమీక్షా వ్యాసాల సంపుటే - ఈ "ద్విశత భారతి"! అంతేకాదు ఆ గ్రంథాలను అంతర్జాలంలోకి ఎక్కించి, ప్రపంచ వ్యాప్త సాహిత్యాభిమానులకు ఉచితంగా అందుబాటులో ఉంచడం మరొక విశేషం! ఆ గ్రంథాలన్నింటికి ఆధునిక సాంకేతిక విజ్ఞానానుగుణంగా QR codes ను ఏర్పర్చి, వాటిని ఈ గ్రంథంలో పొందుపరచడం అశ్వనీ కుమార్ గారి దీక్షకు, ఘనతకు నిదర్శనం. ఆ QR codes ద్వారా ఎవరైనా, ఎప్పుడైనా, ఏ గ్రంథాన్నైనా డౌన్ లోడ్ చేసుకొని చదువుకోవచ్చు. ఈ ఒక్క గ్రంథం మీ చేతిలో ఉంటే .. "యువభారతి" గత 60 ఏళ్లుగా ప్రచురించిన సమస్త సాహిత్య భాండాగారం తమ గుప్పిటిలో ఒదిగినట్టే! బహుశః ఏ సంస్థ ఇంతవరకు ఈ విధంగా ముందడుగు వేసి ఉండక పోవచ్చు. అదీ - గర్వించదగ్గ "యువభారతి" సంస్థ సాహిత్య సేవా నిష్ఠ!

ప్రతి తెలుగింటా ఈ గ్రంథాన్ని ప్రేమగా దాచుకోవాలని, భావి తరాలకు మన అమూల్యమైన సాహిత్యసారాన్ని పదిలంగా అందించేందుకు "యువభారతి" తలపెట్టిన ఈ మహాయజ్ఞంలో .. ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలుగువారంతా పాలుపంచుకోవాలని మా ఆకాంక్ష!

తేదీ : 23/12/22

హైదరాబాదు. (ఆచార్య ఫణీంద్ర)

# ప్రేరణ

ఒకసారి నేను, విశ్వనాథంగారు, మలపాక పూర్ణచంద్రరావు గారు, అప్పటి యువభారతి అధ్యక్షులు శ్రీ మాడభూషి అనంతాచార్య గారు కలసి డా.కె.ఐ.వరప్రసాద రెడ్డి గారింటికి పనిమీద వెళ్ళటం జరిగింది. మాటల సందర్భంలో ఆయన "ఈరోజుల్లో పుస్తకాలు పట్టుకుని చదవటం తగ్గిపోయింది. అంతా తమ కంప్యూటర్లలో download చేసుకుని net లోనే చదువుకుంటున్నారు. ముఖ్యంగా మా లాగా తరచూ విమానాలలో ప్రయాణించేవారికి పుస్తకాలను వెంట తీసుకుని వెళ్ళటం ఇబ్బందికరం. అంతేకాక net లో అయితే అవసరాన్నిబట్టి font ని పెద్దగా చేసి చదువుకోవచ్చు. అందుకని మన యువభారతి ప్రచురణల నన్నింటినీ digitalize చేసి internet లో upload చేస్తే బాగుంటుంది. అందుకు అవసరమైన ఖర్చు ఏమైనా ఉంటే అది నేను భరిస్తాను" అని అన్నారు. అప్పుడు మాకు మన యువభారతి ప్రచురణలను internet లో upload చేయాలనే సంకల్పం కలిగింది.

అప్పుడే ఒక తెలుగు భాషాభిమానితో పరిచయం జరిగింది. ఆయన మన పుస్తకాలనన్నిటినీ ఉచితంగా scan చేయడానికి ముందుకు వచ్చారు. ఆ అవకాశాన్ని అందిపుచ్చుకుని మేము వెంటనే పుస్తకాలను scanning కి ఇచ్చాము. అలా అప్పటివరకు letter press లో అచ్చయిన దాదాపు 150 ప్రచురణలను scan చేయించాము. ఆ తరువాత వచ్చిన ప్రచురణలు DTP చేసి అచ్చు వేయించినవి కాబట్టి వాటి soft copies మనకు CDల రూపంలో అందుబాటులో ఉన్నాయి. మనంతట మనమే ఒక site తీసుకుని upload చేయాలంటే చాలా ఖర్చుతో కూడుకున్న పని గనక, ఉచితంగా upload చేసేందుకు ఏమైనా web sites ఉన్నాయా అని వెదకగా, మాకు "archive.org" అనే site దొరికింది.

అప్పుడు నెమ్మదిగా ఒక్కొక్కటిగా పుస్తకాలను upload చేయటం ప్రారంభించాము. అలా upload చేసిన పుస్తకాల links మన యువభారతి ఫౌండేషన్ website లో పెట్టాలని నిర్ణయించుకున్నాము. Scanning చేయించటం లేదా PDF file ని సిద్ధం చేసి అందించటం నా బాధ్యత ఐతే, వాటిని upload చేయడం విశ్వనాథం గారి బాధ్యత. మా ఇద్దరికీ టెక్నాలజీ

లో అనుభవం లేని కారణంచేత పని నత్తనడకన సాగింది.

5 అక్టోబర్, 2022 నాటికి యువభారతి 59 సంవత్సరాలు పూర్తి చేసుకుని, షష్ట్యబ్ది లో అడుగిడిన సందర్భంగా అంతవరకూ ప్రచురించిన 200 పుస్తకాలను internet లో upload చేసి అందరికీ ఉచితంగానే download చేసుకునేందుకు అవకాశం కల్పించాలని, అలాగే ఆ పుస్తకాల నన్నింటినీ సంక్షిప్తంగా పరిచయం చేస్తూ "ద్విశత భారతి" పేర ఒక పుస్తకాన్ని ప్రచురించాలని నిర్ణయించటం జరిగింది.

అప్పటికే దాదాపు 110 యువభారతి ప్రచురణకు సంక్షిప్త పరిచయం రాసిన మా యువభారతి సంస్థ వరిష్ఠ సభ్యులు శ్రీ పత్రి అశ్వనీ కుమార్ గారికి ఈ పుస్తక సంకలన బాధ్యతల నప్పగించటం జరిగింది. ఆయన అహర్నిశలు కృషి చేసి, మా ప్రణాళికకు మెరుగులు దిద్ది, మేం అనుకున్న దానికన్నా మిన్నగా లేటెస్ట్ టెక్నాలజీ వినియోగించి పుస్తకాలను సులభంగా డౌన్లోడ్ చేసుకునేందుకు వీలుగా QR కోడ్ ను కూడా జతపరచి పుస్తకాన్ని అందించారు. వారికి నా పక్షాన, యువభారతి పక్షాన అభినందనలను అందచేస్తున్నాను.

అలా 2009 ప్రాంతంలో బీజం పడిన ఈ project 2022 లో సాకారమైంది. మా కల ఫలించింది.

యువభారతి ఎల్లప్పుడూ "వీలయినంత తక్కువ ధరకు వీలయినంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందించాల" నే ధ్యేయంతో పనిచేసింది. ఇప్పుడు మరో అడుగు ముందుకు వేసి వీలయినంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని "ఉచితంగా" అందిస్తోంది. ఈ పుస్తకాన్ని కొంటే యువభారతి పుస్తక భాండాగారాన్ని మీరు సొంతం చేసుకున్నట్లే.

ఎప్పటిలాగే మా ఈ ప్రచురణను కూడా ఆదరిస్తారని ఆశిస్తూ!... ఆకాంక్షిస్తూ!

భవదీయుడు

అయలసోమయాజుల నాగేశ్వరరావు

ఉపాధ్యక్షులు, యువభారతి

# మన(సు)లో మాట

1986 లో నాకు వివాహమైన సందర్భంలో నా శ్రీమతి పద్మ కామేశ్వరి తో పాటు యువభారతీయులు శ్రీమతి కె బి లక్ష్మి, శ్రీ కె వి కామేశ్వరరావు దంపతుల ఇంటికి వెళ్ళినప్పుడు, అప్పటికి రెండు మూడేళ్ళుగా యువభారతి దైనందిన కార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటున్న నాకు పుస్తకపఠనంలో ఉన్న ఆసక్తిని గమనించి, నాపట్ల వారికున్న అభిమానంతో ఆ దంపతులు వాళ్ళ దగ్గర 'అదనంగా' ఉన్న దాదాపు నలభై యువభారతి ప్రచురణలను (ఇద్దరూ autograph చేసి మరీ) నాకు కానుకగా ఇచ్చారు. మేమిద్దరం ఒక రిక్షాలో ఆ పుస్తకాలనన్నిటినీ అపురూపంగా పెట్టుకుని, ఇంటికి చేరాం.

తరువాత ఒక్కొక్క ప్రచురణనూ చదువుతుంటే, యువభారతి ప్రచురణల 'విశ్వరూపం' నా కళ్ళముందు కదలాడసాగింది. ప్రముఖ సాహితీవేత్తలు, వాంగ్మయ దివాకరులు, మహామహోపాధ్యాయులు, వారి మేధోమథనం ద్వారా వెలికి తీసి, గ్రంథస్తం చేసిన అమృతతుల్యమైన ఈ సాహితీ సంపద గురించి వీలైనంత ఎక్కువమందికి తెలియజేయాలంటే, ఈ ప్రచురణల సంక్షిప్త పరిచయంతో ఒక సంకలనాన్ని తయారుచేయడమే సరైన మార్గం అన్న ఆలోచన – ఆ క్షణంలోనే కలిగింది.

వెంటనే ఆ ఆలోచనను కార్యరూపంలో పెట్టి, అప్పటిదాకా ప్రచురించబడ్డ దాదాపు 110 ప్రచురణలలో దాదాపు 90 ప్రచురణలకు పరిచయం వ్రాశాను. ఐతే కొన్ని అనివార్య కారణాల వల్ల 1987 లో నేను హైదరాబాద్ నుండి గుజరాత్ రాష్ట్రానికి, తరువాత మహారాష్ట్రకు ఉద్యోగార్థం వెళ్ళవలసివచ్చింది. అప్పుడు ఆ లిఖితప్రతిని యువభారతి కార్యాలయంలోనే ఉంచి, నేను అహమ్మదాబాద్ కు బయలుదేరాను.

Cut చేస్తే - 35 సంవత్సరాల తరువాత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా ప్రచురించిన ఐదు ప్రచురణలతో యువభారతి 200 ప్రచురణలను పూర్తిచేసుకుంటున్న శుభతరుణంలో, ఈ 200 ప్రచురణల సంక్షిప్త పరిచయం "ద్విశత భారతి" పేరున 201 వ ప్రచురణగా తీసుకురావాలని యువభారతి కార్యవర్గం నిర్ణయం తీసుకోవడం – కేవలం

నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను. ఈ సందర్భంగా శ్రీ వంగపల్లి విశ్వనాథం గారికీ, నా అసంపూర్ణ రచనను అతిభద్రంగా దాచిఉంచి, నాకు తిరిగి అందజేసిన శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారికీ నేనెంతో ఋణపడిఉంటాను.

యువభారతి ఒక ప్రచురణ సంస్థ కాకపోయినా, తెలుగు ఎదలో తెలుగుదనం వెల్లువలా పారాలని, తెలుగింటిలో తెలుగు దీపం అఖండంగా వెలగాలని, భాషాభిమానం కలగాలంటే మాతృభాషా సాహిత్య పఠనమే ప్రథమ కర్తవ్యం అన్న భావనతో ఉడతాభక్తిగా కృషి చేస్తోంది. యువభారతి ప్రచురణలలోని వైవిధ్యం చూస్తే మనందరికీ ఆ విషయం అర్థమౌతుంది.

తెలుగు సాహిత్యాన్ని — సామెతలు, శతకాలు, బాలల కథలు, కృతులు, కీర్తనలు, రూపకాలు, కవితలు, కథానికలు, కథలు, నాటకాలు, నాటికలు, రుబాయిలు, కవిసమయములు - వంటి ఎన్నో సాహితీ ప్రక్రియలు సుసంపన్నం చేశాయి. ఆయా ప్రక్రియల గురించి సాధికారికంగా చెప్పగలిగిన ప్రజ్ఞా దురంధరుల చేత అందరికీ అర్థమయ్యే భాషలో వ్యాసాలను వ్రాయించి, వాటిని పుస్తకాలుగా ప్రచురించిన ఘనత కేవలం యువభారతిదే.

అలాగే 'కవితా వైభవం' సీరీస్ లో జగద్గురు శంకరాచార్య, కాళిదాసు, మాఘుడు, నన్నయ, పాల్కురికి సోమనాథుడు, నన్నె చోడుడు, తిక్కన, నంది తిమ్మన, ధూర్జటి, పింగళి సూరన, అయ్యలరాజు రామభద్రుడు, తులసీదాసు, అల్లసాని పెద్దన, సూరదాసు, చేమకూర వేంకట కవి, కంకంటి పాపరాజు, స్వామి వివేకానంద, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, తిరుపతి వేంకట కవులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, కుందుర్తి వంటి కవుల రచనలను విశ్లేషించి ప్రచురించింది. బహుశా ఇంతమంది కవుల కవితా వైభవాలను ప్రచురించిన ఘనత కూడా యువభారతిదే.

నాలుగు దశాబ్దాల పాటు (అంటే 1971 నుండి 2011 వరకు) నిర్వహించిన పద్నాలుగు లహరీ కార్యకమాలలో ప్రాచీన కవులు - నన్నయ భట్టారకుడు, తిక్కన సోమయాజి, పాల్కురికి సోమనాథుడు, బమ్మెర పోతనామాత్యులు, నాచన సోముడు, పిల్లలమర్రి పినవీరభద్రుడు, శ్రీనాథుడు, శ్రీ కృష్ణదేవరాయలు, పింగళి సూరన, తెనాలి రామకృష్ణుడు మొదలైన కవుల నుండి, గత రెండు శతాబ్దాలలో సాహితీరంగంలో విశేష కృషి చేసి, సాహితీ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగ్గ పేరు ప్రతిష్టలు సంపాదించుకున్న యోగి వేమన, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులు, శ్రీ పానుగంటి లక్ష్మీ

నరసింహారావు, తిరుపతి వేంకట కవులు, శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులు, శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, గుడిపాటి వెంకట చలం, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ జాషువా, శ్రీ నండూరి సుబ్బారావు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, శ్రీ కుందుర్తి, శ్రీ ఆరుద్ర, శ్రీ దాశరథి, శ్రీ నారాయణరెడ్డి గారలు చేసిన రచనలను సాహితీ ప్రియులకు దిఙ్మాత్రంగా పరిచయం చేసింది యువభారతి.

చివరగా, చాలాకాలం పాటు యువభారతి ప్రచురణలకు సంపాదకులుగా తమ విశిష్ట సేవలను అందించిన డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యం గారు 'యువభారతి' కార్యకలాపాల గురించి కవితాత్మకంగా చెప్పిన ఈ సీసపద్యంతో నా ఈ 'మనసులో మాట' ను ముగిస్తాను.

*చిమ్మచీకట్లను చీదరించుటకంటె చిరుదివ్వె వెలిగించు శిల్పమెరిగి*
*సామాన్యజనులలో సాహిత్య చైతన్య సందీప్తి పోషించు సభలు తీర్చి*
*కమనీయకావ్యాల కవితాకళాశిల్ప వైభవాల్ వివరించు ప్రభలు చిమ్మి*
*మానవమూల్యాల మహనీయ సంస్కృతి నిర్మాణ శిక్షణ నీతి నెరపి*

*భారతీపాదమంజీర భవ్యరవము*
*తెలుగువారల గుండెలో వెలుగునట్లు*
*ఆంధ్రజనతకు నవతకు అంకితమ్ము*
*ఆంధ్రజనతకు నవతకు అంకితమ్ము*

యువభారతి నిర్మించిన ఈ సరస్వతీమాత దేవాలయాన్ని ఎందరెందరో ప్రజ్ఞా ధురీణులు తమ ప్రత్యేకమైన వచోశిల్పాలతో, చిత్ర విచిత్ర రీతులతో తీర్చి దిద్దారు. ఈ పుస్తకం, వారు చెక్కిన శిల్పాలను చూపించే కరదీపిక మాత్రమే - లేదా - యువభారతి సాహితీవనంలో ఎందరో తోటమాలుల శ్రమతో పూసిన పువ్వులను ఒక మాలగా కట్టి, ఆ సరస్వతీ మాత మెడలో అలంకరించడానికి తోడ్పడిన ఒక దారం మాత్రమే.

మీ

పత్రి అశ్వనీ కుమార్

# అకారాది క్రమంలో యువభారతి ప్రచురణలు

# అకారాది క్రమంలో యువభారతి ప్రచురణలు

# అకారాది క్రమంలో యువభారతి ప్రచురణలు

# అకారాది క్రమంలో యువభారతి ప్రచురణలు

తెలుగింటిలో తెలుగుదీపం అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్ర లేచి మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతరం కృషితో పయనం కొనసాగించాలనే
ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది.
భాషాభిమానం కలగాలంటే మాతృభాషా సాహిత్య
పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువమందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమ సాహిత్యం అందించేందుకు యువభారతి
పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషి చేద్దాం
ఆ పది పుస్తకాలలో ఏ ఒక్కటిగా నైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషి చేద్దాం.

---


## యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు, తిలక్ రోడ్,
హైదరాబాద్ – 500 001

## 1. సరస్వతీ సాక్షాత్కారం




ఒక చక్కని రసపుష్టి గల కావ్యాన్ని తెలుగు సాహితీ ప్రియులకు అందించాలని యువభారతి చేసిన చిన్ని ప్రయత్నమిది. 'రాయికి రాయికి మధ్య గల పరాయితనాన్ని తగ్గింపగా ఉడుత రాల్చినట్టి ఇసుక మాదిరిగా' ఉడుతా భక్తిగా చేసిన ఈ ప్రయత్నం – శ్రీ అనుములకృష్ణమూర్తిగారువ్రాసిఇచ్చినఈకవితాధార, మా 'మొదటి ప్రచురణ' గా, యువభారతికి అత్యంత ప్రీతిపాత్రమైన కవితా కావ్యంగా రూపుదిద్దుకొంది. రెండుసార్లు ముద్రించబడ్డా, ఇప్పుడు ప్రతులు అందుబాటులో లేవు. తెలుగురసికుల అశేష ఆదరాభిమానాలు, ఉదార హృదయాలు మా ఉడుతా భక్తిని ప్రోత్సహించినందుకు కృతజ్ఞతలు.

SCAN FOR E-BOOK

## 2. జీవన గీత




ఖలీల్ జిబ్రాన్ – ఒక మహాకవి, దార్శనికుడు. 19 వ శతాబ్దపు తొలి దశకాలలో, సర్వకాలీన, సార్వజనీన సత్యాలను నిర్భయంగా ప్రకటించిన ద్రష్ట. ఆయన రచించి, మానవతా విలువలకు నివాళులెత్తిన కారుణ్యోపనిషత్తు "The Profet" ను, ఎవరి జన్మదినాన్ని తెలంగాణా ప్రభుత్వం "తెలంగాణా భాషా దినం" గా ప్రకటించిందో, అటువంటి మహనీయుడు, స్వాతంత్ర్య సమర యోధుడు, శ్రీ కాళోజీ నారాయణరావు గారు సరళమైన తెలుగులోకి అనువదించిన చిన్ని పుస్తకం- జీవన గీత. ఈ జీవన గీతను, ఖలీల్ పాటగా బ్రతుకు బాటగా, శ్రీ కాళోజీ గొంతెత్తి పాడగా ఆ సంగీతాన్ని మీకు అందించాం.

SCAN FOR E-BOOK

## 3. వీచికలు



యువకులలో ఆలోచనాశక్తినీ, వచఃశక్తినీ, రచనాశక్తినీ అంకురింపజేసి వారిలోని సృజనాత్మకశక్తిని నిర్మాణాత్మక కార్యక్రమాల వైపు మరలించడం యువభారతి ధ్యేయం. సంస్థ నలుగురు సభ్యులు – శ్రీయుతులు ఇరివెంటి కృష్ణమూర్తి గారు, చక్రవర్తి వేణుగోపాల్ గారు, అల్లంరాజు వెంకట్రావు (సుధామ) గారు, వంగపల్లి విశ్వనాధం గార్ల కవితా సంకలనం.

SCAN FOR E-BOOK

## 4. పంచవటి



సుదూరతీరాలకు సైతం తమ చల్లని గాలుల్ని పంపించగల బలిష్టమైన శాఖోపశాఖలతో, సాహితీవనంలో పటిష్టంగా చాలాకాలం నుంచి నిలిచి, ఎప్పటికపుడు కొత్త పవనాలను నింపుతూ ఎందఱో యువరచయితల, మరెందరో పాఠకుల అభిమానాలను అండగా కలిగిఉన్న ఐదుగురు రచయితల - శ్రీయుతులు అవసరాల రామకృష్ణారావు, మంజుశ్రీ, శీలా వీర్రాజు గారలు, శ్రీమతులు లత, సి. ఆనందరామం గార్ల - మేలైన కథల సంపుటి – ఈ పంచవటి.

SCAN FOR E-BOOK

## 5. రచన



సమాజంలో విలువలు, వాటి నిర్వచనాలు మారుతూ వచ్చాయి. మార్పు మంచికే ఐతే బాధ లేదు. మార్పు మరో మంచి మలుపుకి, మరో గొప్ప సత్యానికి అవకాశం ఇవ్వాలి గానీ, విచ్చలవిడితనానికీ, విశృంఖలత్వానికీ కాదు. ఈ నేపధ్యంలో – "మారుతున్న విలువలు – రచయితల బాధ్యతలు" అనే అంశంపై గోష్ఠి నిర్వహించి, ఆ సందర్భంగా 37 గురు ప్రముఖ సాహితీవేత్తల చేత ప్రత్యేక వ్యాసాలను వ్రాయించి ప్రచురించిన వ్యాస సంకలనం.

SCAN FOR E-BOOK

## 6. కావ్య లహరి



ప్రాచీనాంధ్ర సాహిత్యం గురించి లబ్ద ప్రతిష్టులైన సాహితీ వేత్తలతో ఉపన్యాస మంజరీ కార్యక్రమాలను ఏర్పాటు చేయడమే కాక, వారి ఉపన్యాస సారాంశాన్ని ఒక పుస్తక రూపంలో ప్రచురించి, రసజ్ఞులైన భాషాభిమానులకు అందజేయడమే - యువభారతి నిర్వహించిన "లహరి" కార్యక్రమాల లక్ష్యం. ఈ "లహరి" కార్యక్రమాలలో మొట్ట మొదటిది – కావ్య లహరి. విశ్వ సాహిత్యంలోనే నిత్య నూతన భావపుష్టికి, తాత్వికసృష్టికి, కవితాపారమ్యానికి, సౌందర్యానుభూతికి చెరగని గురుతులుగా చిరకాలం నిలిచి పోయే ఆనవాళ్ళు – మన కావ్యాలు. శృంగార నైషధం, మనుచరిత్ర, పారిజాతాపహరణం, ఆముక్తమాల్యద, పాండురంగమహాత్మ్యం, వసుచరిత్ర, విజయ విలాసం అనబడే ప్రాచీనాంధ్ర ప్రబంధ కావ్యాలపై ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారి ఉపన్యాస పాఠాలను యధాతధం అచ్చు వేయించి, సహృదయులైన సాహిత్యాభిమానులకు అందించబడింది.

SCAN FOR E-BOOK

## 7. అక్షరాలు




అనంత సాహితీ విహాయసంలో మిలమిలలాడే అనంత కోటి నక్షత్రాలలో 'అ'క్షరమై నిలిచే పుస్తకం — పదముగ్గురు యువభారతీయుల కవితల సంకలనం. మనిషిలో అంతర్లీనంగా ఉండే ప్రతిభను బహిర్గతపరచే ప్రయత్నం.

SCAN FOR E-BOOK

## 8. చైతన్య లహరి




ప్రాచీనాంధ్ర సాహిత్యం గురించి లబ్ద ప్రతిష్టులైన సాహితీ వేత్తలతో ఉపన్యాస మంజరీ కార్యక్రమాలను ఏర్పాటు చేయడమే కాక, వారి ఉపన్యాస సారాంశాన్ని ఒక పుస్తక రూపం లో ప్రచురించి, రసజ్ఞులైన భాషాభిమానులకు అందజేయడమే - యువభారతి నిర్వహించిన "లహరి" కార్యక్రమాల లక్ష్యం. ఈ తరంగాలలో మొట్టమొదటిది "కావ్య లహరి" కాగా, రెండవది ఈ "చైతన్య లహరి".

సాహితీ మహితాత్ములు, చైతన్యమూర్తులు - తిక్కన సోమయాజి, పాల్కురికి సోమనాథుడు, శ్రీ కృష్ణదేవరాయలు, యోగి వేమన, గురజాడ అప్పారావు గార్ల ప్రతిభా ప్రభావాలను గూర్చి, ప్రసిద్ధాంధ్ర సాహిత్యాచార్యులు, ఆచార్య దివాకర్ల వెంకటావధాని, శ్రీ గడియారం రామకృష్ణ శర్మ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి, శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు గార్ల ఉపన్యాస మంజరికి కల్పించిన గ్రంథ రూపమే - ఈ "చైతన్య లహరి". మహాభారతం నుండి ముత్యాల సరాలవరకు సాహిత్య చరిత్రలో ఉజ్వలంగా మెరిసిన ధ్రువతారల ప్రతిభా ప్రభా లహరి — ఈ "చైతన్య లహరి".

SCAN FOR E-BOOK

## 9. మహతి




భారత స్వాతంత్ర్య రజతోత్సవ ప్రచురణ. ప్రస్తావన, ప్రవేశం, ప్రతిభ, ప్రయోగం, పరిశీలనం, ప్రస్తారం, ప్రభావం – అన్న సప్త స్వర విన్యాసం వినిపించి, సమకాలీన సారస్వత సంరంభానికి ప్రతీకగా నిలిచి, సరికొత్త సాహిత్య సమారోహానికి సామగానం సారించి స్వాతంత్ర్య రజతోత్సవాలకు సరికొత్త కానుకగా యువభారతి అందించిన పుస్తకం – మహతి. పేరును తలుచుకుంటేనే, యువభారతీయులందరి హృదయాలలో తీయని జ్ఞాపకాలను చెలరేగేలా చేసే పుస్తకం – మహతి. ముఖ్యంగా – UNO గ్రంధాలయంలో చోటుచేసుకుని యువభారతి గౌరవాన్ని ప్రపంచవ్యాప్తం చేసిన పుస్తకం – మహతి.

SCAN FOR E-BOOK

## 10. Free India Forges Ahead




స్వతంత్ర భారత దేశం 23, 25 ఏళ్ళలో సాధించిన రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, సాహిత్య, విద్యారంగాల ప్రగతికి దర్పణం. యువభారతి మొట్టమొదటి ఆంగ్ల ప్రచురణ.

SCAN FOR E-BOOK

## 11. స్వరాలు




ఒక వసంతంలో 'వీచికలు'గా కదిలి మరో వసంతంలో 'అక్షరాలు' కూర్చుకుని, సత్వరమే 'స్వరాలు' పలికారు యువభారతీయులు. ఇక ఈ కవితా సంపుటిలో 'కవన' కుతూహలంతో గళం ఎత్తి క్రొంగొత్త 'స్వరాలను' పలికించారు – యువభారతీయులు .

SCAN FOR E-BOOK

## 12. ఉషస్సు



యువభారతి సాహితీమిత్ర పథకంలో సభ్యులైన వారి కవితామయ హృదయాలను రసిక ప్రపంచానికి పరిచయం చేయాలన్న ఉద్దేశ్యంతో ప్రచురించిన ఈ పుస్తకంలో 130 మంది రచయితలు వారి భావాలను కవితలుగా ప్రసరింపచేసారు.

SCAN FOR E-BOOK

## 13. మళ్ళీ వెలుగు




ఈ వచనకావ్యంలో ఒకనాటి జీవితం పలువేళల్లో అవతారం దాల్చిన ఉదంతం కథా వస్తువు. నగరంలోనే బాహిర జీవితాన్ని కవి అంతర్ముఖంగా దర్శించి మలచిన ఈ కావ్యమొక స్పందనం, ఒక వ్యాఖ్యానం, ఒక అనుభూతి, ఒక చిత్రశాల. శ్రీ శీలా వీర్రాజు గారు, నగరంలోని పొగలను, సెగలను, నవ్వులను, ఏడ్పులను, వికటాట్టహాసాలను, నిద్రాముద్రిత వివేకాన్ని, కన్నీటిని, పన్నీటిని, మనిషిని, మనీషిని చూపించారు.

SCAN FOR E-BOOK

## 14. ఉదయం



యువభారతి ప్రకటించిన 'సాహితీ మిత్ర', 'సాహితీ భూషణ', 'భారతీ భూషణ' పథకాలలో సభ్యులైన వారిలో ఎంతోమంది కవులు, రచయితలు, పాత్రికేయులు ఉన్నారు. ఆ సభ్యులలో కొందరు రచయితలు రాసిన కథల సంకలనం – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 15. కథా వాహిని-1



యువభారతి 'సాహితీ మిత్ర' పథకం లో సభ్యులైన వారినుండి కథలను సేకరించి వాటిలో మేలైన వాటి సంకలనం ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 16. కథా వాహిని-2



యువభారతి 'సాహితీ మిత్ర' పథకం లో సభ్యులైన వారినుండి కథలను సేకరించి వాటిలో మేలైన వాటి సంకలనం ఈ 65 పేజీల పుస్తకం.

SCAN FOR E-BOOK

## 17. మందార మకరందాలు




భక్తికి మారుపేరుగా భాగవతాన్ని చెప్పుకుంటారు – తెలుగువారు. భాగవతంలో పోతన కవితలతో కట్టిన బొమ్మలు, అక్షరాలలో అమర్చిన శిల్పాలు, పాత్రల మనః ప్రవృత్తికి ఛందం పట్టిన దర్పణాలు. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డాక్టర్ సి నారాయణరెడ్డి గారు - తెలుగుదనం తొలకరించే తియ్యని అందాలు, ప్రజల నాల్కలపై నిత్య వ్యవహారంలో క్రొత్త అర్థాలను సంతరించుకొన్న పద్య పాదాలు, ఉక్తి వైచిత్రుల వలన వ్యక్తమయ్యే చమత్కారాలు – ఇలా ఎన్నో విశేషాలను మెరుపుల్లా మెరిపింప జేశారు. ప్రధమంగా 1973 లో ప్రచురించిన 25,000 కాపీలను కేవలం ఒక్క రూపాయ ధరకే సాహితీ ప్రియులకు అందించిన ఘనత యువభారతిది. తెలంగాణా రాష్ట్రం ఏర్పాటైన తరువాత జరిగిన ప్రపంచ తెలుగు మహా సభలలో పాల్గొన్న delegates అందరికీ ఈ ప్రచురణ ఉచితంగా అందజేయబడింది. ఈ ప్రచురణ ప్రస్తుతం తిరుమల తిరుపతి దేవస్థానం వారి ప్రచురణలలో భాగంగా ఉన్నది.

SCAN FOR E-BOOK

## 18. వికాస లహరి




యువభారతి 18 వ ప్రచురణ, లహరి కార్యక్రమాలలో మూడవది - ఈ “వికాస లహరి”. ముకుళించిన మొగ్గలు ముగ్ధ మనోహరంగా వికసించడం వికాసం. సుప్త చైతన్యం ప్రతిభోన్మీలనంగా ప్రగతి వీచికలను ప్రసరిస్తూ ప్రస్ఫుటం కావడం వికాసం. ఆంధ్ర సాహిత్య నందనంలో కావ్య వచస్సులను ప్రసరింపజేసిన నన్నయ భట్టారకుని గురించి ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారు, భక్తి కవితా పయస్సులను పొంగించిన బమ్మెర పోతనామాత్యుల గురించి డా. సి నారాయణరెడ్డి గారు, కల్పనా రోచిస్సులను విరజిమ్మిన పింగళి సూరన గురించి డా. జి వి సుబ్రహ్మణ్యం గారు, సంస్కరణోద్యమ ఉషస్సులను ఉదయింప జేసిన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారి గురించి ఆరుద్ర గారు, అవధాన కళా యశస్సులను వినూత్న శోభలతో వెల్లివిరియించిన తిరుపతి వేంకట కవుల గురించి ఆచార్య దివాకర్ల వెంకటావ ధాని గారల విశిష్ట సాహితీ సేవా సమీక్ష - ఈ వికాస లహరి.

SCAN FOR E-BOOK

## 19. ప్రజా సూక్తం




ఈ ప్రజాసూక్తాన్ని రచించినది ప్రజలే. ఏరుల పుట్టుక, మునుల పుట్టుక లాగే, సామెతల పుట్టుక కూడా ఎవరికీ తెలియదు. వాటి కర్త కూడా ఎవరో తెలియదు కనుక వాటిని 'అపౌరుషేయాలు' అన్నా బాధ లేదు. అవి కూడా వేదాలవలెనే ఒక తరం వారు మరొక తరం వారికి అందిస్తూ ఉంటే, రాత పూటలకు నోచుకోక, జనసామాన్యం నోళ్ళలో భద్రంగా భద్రవాసం చేస్తూ ఉన్న భాషా సంపద. ఆ సామెతలలో కొన్నింటిని ఏర్చి కూర్చిన ఈ పుస్తకం. అచ్చయిన తరువాత నాలుగు సార్లు పునర్ముద్రణకు నోచుకున్నది ఈ ప్రజాసూక్తం.

SCAN FOR E-BOOK

## 20. వేమన్న వేదం




మట్టిలో పుట్టి మహోన్నత శిఖరాలనందుకున్న మానవతామూర్తి మన వేమన. ఆయన మనుషుల మధ్య తిరుగుతూనే, మానవ జీవిత సత్యాలను నిత్యాన్వేషణశీలంతో దర్శించి, విమర్శించి, మథించి, ఆ అన్వేషణలో అందివచ్చిన అనుభవాలను ఆటవెలదులలో అలవోకగా లోకానికి అందించిన మహనీయుడు. వేమన పద్యాలలో 40 పద్యాలను ఎన్నుకుని రసార్ద్రమైన ఆరుద్ర వ్యాఖ్యానంతో వెలువడ్డ ఈ పుస్తకం ఇప్పటివరకు ఐదుసార్లు పునర్ముద్రించబడింది.

SCAN FOR E-BOOK

## 21. భోగినీ లాస్యం




జనబాహుళ్యంలో ప్రచారంలో ఉన్న కధనం ప్రకారం సింగభూపాలుని వేశ్య పేరు భోగిని. ఆమె తల్లి తగదని వారించినా వినక ప్రభువును కలిసి అతని అనుగ్రహం బడసింది. అతని ప్రియురాలిగా హృదయ సామ్రాజ్యాన్ని ఏలింది. 'భోగినీ లాస్యం' పోతన చరిత్రంలోని ఒక మధుర ఘట్టం. నాట్యకళా వైభవాన్ని, శృంగార రస మధురిమనీ, ప్రణయ భక్తీ భావనారాధనాన్నీ వివరించే రచనం. సవ్యాఖ్యానంగా ఆ ఘట్టాన్ని వరదాచార్యులవారు, ఈ గ్రంధాన్ని యువభారతికి ఉపాయనంగా అందించారు. శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకొని, పునర్ముద్రించి, విశాఖపట్నంలో జరిగిన వారి శతజయంతి ఉత్సవ సభలో ఆవిష్కరించి, 'యువభారతి' భక్తిపూర్వకంగా సమర్పించిన పూజా కుసుమం — ఈ భోగినీ లాస్యం.

SCAN FOR E-BOOK

## 22. వడగళ్ళు




ఇది సాహితీ వాహిని పరంపరలో ఐదవ తరంగం. తెలుగులో కావ్యాలలో లాగానే, వ్యాసాలలో కూడా హాస్యాన్ని రంగరించి రచన సాగించిన రచయితలు తక్కువమందే కనబడతారు. శ్రీ రావూరు వెంకట సత్యనారాయణ రావు గారు, తెలుగు వ్యాసాన్ని సున్నితమైన హాస్యంతో సుందరతరం చేసి, పఠితల హృదయాలకు సూటిగా చేరి, సొగసుగా ఆకట్టుకునేటట్టు చేశారు. వారి 'వడగళ్ళ' జడివానలో ఒక జల్లు — ఈ యువభారతి ప్రచురణ.

SCAN FOR E-BOOK

## 23. నా గొడవ




'చెమ్మ గిల్లని కనులు బ్రతుకు కమ్మదనము చూడలేవు – చెమ్మగిల్లని కనులు బ్రతుకు కమ్మదనం చాటలేవు' అన్న కవిత విన్నపుడు, 'అక్షర రూపం దాల్చిన ఒకే ఒక్క సిరా చుక్క - లక్ష మెదళ్ళకు కదలిక' అన్న కవిత చూసినపుడు – కాళన్న జ్ఞాపకం రాకపోరు. యువభారతికి ఆత్మీయులు, శ్రీ కాళోజీ నారాయణరావు గారి షష్టిపూర్తి సందర్భంలో ప్రచురించిన ఈ పుస్తకం, వారికి పట్టిన అక్షర నీరాజనం.

SCAN FOR E-BOOK

## 24. శ్రీనాధుని కవితా వైభవం




ఇది సాహితీవాహిని పరంపరలో వెలువడ్డ ఆరవ తరంగం. మహాసాగర సమమైన శ్రీనాధుని సాహిత్యంతో పరిచయం కలిగించే కొన్ని పద్యాలకు అనువైన పద్ధతిలో వ్యాఖ్యానం వ్రాయించి వెలయించిన ఈ పుస్తకంతో, అధ్యయనాభిలాషియైన ఒక తెలుగువాడికి శ్రీనాధుని ప్రతిభతో పరిచయం ఏర్పడుతుంది. మా సంస్థ చేస్తున్న సాహితీ సేవలోని ఆంతర్యాన్ని, నైర్మల్యాన్ని అర్థంచేసుకుని మాకు చేదోడు వాదోడుగా ఉన్న తపస్వులు, మనస్వులు, డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యంగారు ఈ పుస్తకాన్ని మాకు వ్రాసి ఇవ్వడం మా భాగ్యం.

SCAN FOR E-BOOK

## 25. “మేం”




యువభారతి తమ సభ్యులలోని కళాశక్తిని ఉద్దీపనం చేయాలని ఎప్పుడూ కోరుకుంటుంది. సాహితీ ప్రపంచంలో వారికి కూడా స్థానం కల్పించాలన్న చేసిన ప్రయత్నంలో భాగంగా ఇద్దరు యువభారతీయుల - అల్లంరాజు వెంకట్రావు (సుధామ), నాగినేని భాస్కర రావు - కవితా సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 26. విశ్వనాధ కవితా వైభవం




సాహితీ రంగంలో అత్యంత ప్రతిష్టాకరమైన జ్ఞానపీఠ్ పురస్కారాన్నందుకుని తెలుగు బావుటాను విశ్వసాహిత్యంలో ఎగురవేసిన కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారి ప్రతిభా సర్వస్వమని చెప్పదగిన “శ్రీమద్రామాయణ కల్పవృక్షం” నుండి కొన్ని పద్యాలకు శ్రీ జువ్వాది గౌతమరావు గారి కమనీయ వ్యాఖ్య ఈ పుస్తకం. అనంతముఖమైన విశ్వనాధ ప్రతిభను గురించి ఎంత చెప్పినా తక్కువే ! విరాడ్రూపానికి ఎంతపీట వేసినా చిన్నదే !

SCAN FOR E-BOOK

## 27. సిందూరం




గణములు, యతి ప్రాసలనే చందోబంధాల నుండి విడివడి స్వచ్ఛందమైన భావాలను కవితలుగా ప్రచురించిన పదునాలుగురు కవుల కవితా సంకలనం. రెండుసార్లు ముద్రణకి నోచుకున్న ఈ పుస్తకం, బెంగళూరు విశ్వవిద్యాలయం రెండవ సంవత్సరం డిగ్రీ కోర్సుకు పాఠ్య గ్రంధంగా నిర్ణయింపబడడం, యువభారతి కృషికి తావి అబ్బిన చందం.

SCAN FOR E-BOOK

## 28. శిఖరాలూ – లోయలూ




తన విలక్షణమైన ప్రతిభతో మానవ సమాజాన్ని జాగరితం చేసిన ప్రతిభా మూర్తి ఖలీల్ జిబ్రాన్. ఆయన సాహిత్యంలోని కొన్ని కవితోక్తులకు స్వచ్ఛందంగా సాగిన అనుశృంజనం ఈ పుస్తకం. నారాయణరెడ్డి గారి అనువాద శైలికి ఒక్క ఉదాహరణ –

*'మొదటి ముద్దు – వలపు పాటకు తొలకరి;*
*జీవిత తరు శాఖా శిఖపై విరిసిన తొలి విరి;*
*నాలుగు పెదవులు పలికే మౌన మంత్రాక్షరి.'*

SCAN FOR E-BOOK

## 29. భావన




ఎంతో గంభీరమైన, విస్తృతమైన, మనోహరమైన మాట – సూక్తి అనిపించుకుంటుంది. అనుభవజ్ఞులు కాచి వడబోసి చెప్పిన సూక్తులనే జీవిత సత్యాలను – నూటికి మించి ఉన్న శీర్షికల క్రింద విభజించి ప్రచురించబడ్డాయి. మహితాత్ముల ఆలోచనా సుధారాశి నుండి వెలికితీసిన మణులు – భావనలోని సూక్తులు.

SCAN FOR E-BOOK

## 30. ప్రతిభా లహరి




కావ్య లహరితో ప్రారంభమై, చైతన్య లహరితో కొత్త చైతన్యాన్ని పుంజుకుని, వికాస లహరితో వికసించిన యువభారతి ని ప్రభావితం చేసిన నాల్గవ లహరీ కార్యక్రమం “ప్రతిభా లహరి”. బాల్యంలోనే బృహత్కావ్యాన్ని రచించిన ప్రౌఢ కవి శ్రీనాథుని గురించి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీకృష్ణ దేవరాయల వారి భువనవిజయపు శోభను ఇనుమడింపజేసిన తెనాలి రామకృష్ణుని గురించి శ్రీ దాశరథి రంగాచార్య, ఆంధ్ర వచన రచనలో క్రొత్త పుంతలు తొక్కిన అభినవ కాళిదాసు, సాక్షి వ్యాసాల సాహితీ వేత్త, శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారి గురించి శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, తెలుగు సాహిత్యంలో తొలి జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, విభిన్న సాహితీ ప్రక్రియలలో నిష్ణాతుడు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి గురించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని, తన మహా ప్రస్థానంలో మరో ప్రపంచపు అంచులు చూపిన శ్రీశ్రీ గురించి డా. జి వి సుబ్రహ్మణ్యం గార్ల ఉపన్యాసాల సమాహారమే - ఈ వికాస లహరి. అలా శృంగార నైషధం నుండి మరో ప్రపంచం వరకు ప్రసరించిన ప్రతిభా, ప్రభావ, భావప్రభా లహరి – ఈ ప్రతిభా లహరి.

SCAN FOR E-BOOK

## 31. మెరుపులు




శ్రీ పొట్లపల్లి రామారావు గారి "చుక్కలు" పుస్తకాన్ని సంక్షిప్తంగా మెరుపులు అనే గ్రంథరూపంలో యువభారతి వెలువరించింది. శ్రీ రామారావు గారి వృత్తి వ్యవసాయం, ప్రవృత్తి సాహిత్యాధ్యయనం. ఈ మెరుపులన్నీ ముక్తకాలుగా వెలసిన వాక్యాలు, సజీవ సత్యాలు.

SCAN FOR E-BOOK

## 32. తిక్కన కవితా వైభవం




*తిక్కన సోమయాజి కవితాత్మను సాక్షాత్కరింప జేసి, తెలుగు పాఠకులకు ఆ ఉభయకవి మిత్రుని దిఙ్మాత్రం పరిచయం చేసే ప్రయత్నమే మా ఈ తిక్కన కవితా వైభవం. ఈ పుస్తకం కూడా రెండు ముద్రణలకు నోచుకుంది.*

SCAN FOR E-BOOK

## 33. Telugu Novel




తెలుగు సాహితీ ప్రపంచంలో పాఠకుల అశేషాభిమానాలను చూరగొన్న పన్నెండు ఉత్తమ నవలలను ఆంధ్రేతరులకు పరిచయం చేయాలనే ఉద్దేశ్యంతో, ఆ నవలల గురించి సంక్షిప్తంగా ఆంగ్లంలో వ్రాయబడ్డ వ్యాసాల సంకలనం.

SCAN FOR E-BOOK

## 34. మరపురాని మనీషి




సజీవమైన జాతి, తమ ఉనికికి తోడ్పడుతున్న మహితాత్ములను సమాదరిస్తుంది; సంస్మరించుకుంటుంది. దేశాన్ని జాగరితం చేసిన మహాపురుషులు వివిధ రంగాల్ల సాధించిన సిద్ధులను గురించి కొంతైన, సరళమైన భాషలో, క్లుప్తంగా, చమత్కారంగా తెలిపేగ్రంథం – ఈ పుస్తకం. 1982 లో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 'మరపురాని మనీషి' శీర్షికతో శ్రీ తిరుమల రామచంద్ర గారి వ్యాసాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 35. చేమకూర కవితా వైభవం




క్రీస్తు శకం పదునేడవ శతాబ్దంలో వెలసిన కావ్యకర్తలలో చేమకూర వేంకట కవి తలమానికం వంటివాడు. ఆయన వ్రాసిన 'విజయ విలాసం' కావ్యం నుండి ఎంపిక చేసిన పద్యాలకు డా. ఎం కులశేఖర రావు గారి సుమధుర సరళ వ్యాఖ్యానం – ఈ పుస్తకం. ఏ పద్యంలో చూసినా, ఏదో ఒక చమత్కృతి ఏదో ఒక అలంకారం, ఏదో భిన్నమైన శబ్ద విన్యాసం – చదివినవారికే అనుభవైకవేద్యం .

SCAN FOR E-BOOK

## 36. చలం ఆలోచనలు




*చలం మానసిక సమాధిలోంచి సముద్ర వీచికల లాగా పొంగిన ఆలోచనా తరంగాలు – మ్యూజింగ్స్ – ఆయన అంతరాత్మ ఆలపించిన divine songs – ఆయన భావ విహంగాలకు అమరిన musical wings – "చలం మ్యూజింగ్స్" లోంచి కొన్నింటిని ఏరి ప్రచురించుకున్న ఈ పుస్తకానికి ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారి ముందుమాట చదివినకొద్దీ చదవాలనిపించే మాస్టర్ పీస్ !!*

SCAN FOR E-BOOK

## 37. భారతీ వైభవం



భాషకూ, సాహిత్యానికీ, ప్రతిభకూ, వ్యుత్పత్తికీ – సరస్వతి ప్రతీక. తెలుగు కావ్యాల అవతారికలలో ఇష్టదేవతా స్తుతుల సందర్భంగా సరస్వతీ ప్రార్థన చేయని తెలుగు కవి లేదు. శారదా వర్ణనం తెలుగు కబ్బాల పందిళ్ళకు అల్లుకున్న వెన్నెల తీగ. ప్రాచీనార్వాచీనాంధ్ర కవుల శారదా స్తుతి కవితలకు, శ్రీ పాతూరి సీతారామాంజనేయులు గారి పరిమళ వ్యాఖ్య ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 38. భారత నారి నాడూ-నేడూ



స్త్రీ శక్తినీ, వ్యక్తిత్వాన్నీ, సౌశీల్యాన్నీ, వివేచననూ, బాధ్యతలనూ, వీటన్నింటినీ మించి సంఘంలో నాటి నుంచీ నేటి వరకూ క్రమ క్రమంగా మారుతున్న ఆమె స్థానాన్ని పరిశీలనాత్మకంగా చూపించే, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి గారి సుదీర్ఘమైన వ్యాసం.

SCAN FOR E-BOOK

## 39. తిమ్మన కవితా వైభవం




నన్నయ భారత రచనతో ప్రారంభమైన తెలుగు కవితా స్రవంతి 16 వ శతాబ్దంలో మహానదిగా ప్రవహించసాగింది. పురాణేతిహాసాలలో ప్రసిద్ధమైన ఒకే ఒక్క కథను గ్రహించి శృంగార, వీర రస ప్రధానంగా అష్టాదశవర్ణనల సమేతంగా మలచి, ప్రబంధమనే నూతన కావ్య ప్రక్రియను అవతరింపజేశారు తెలుగు కవులు. ఈ పంథాలో నంది తిమ్మన రచించిన పారిజాతాపహరణం ఎప్పటికీ వసివాడని పారిజాతమై తావులను గుబాళిస్తూనే ఉంది. అందులోని కొన్ని పద్యాలకు, డాక్టర్ బి వి కుటుంబ రాయ శర్మగారి సులభ వ్యాఖ్యానమే ఈ ప్రచురణ.

SCAN FOR E-BOOK

## 40. కవితా లహరి




తనకంటే పూర్వమున్న కవితారీతుల కంటే కొత్త గుణాలను ప్రదర్శించిన నాచన సోముడు, ప్రబంధ కవితా మార్గానికి అంకురార్పణ చేసిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, బ్రతుకుబాధల చెడును ఆస్వాదించి, మతాతీతమైన కవితలను సుమధురంగా వెలువరించిన జాషువా, కాల్పనిక కవితా పథానికి దిగ్దర్శనం చేసిన దేవులపల్లి, యుగోచిత అగ్రగామిత్వంతో ఆలోచనా లోచనాలతో తిమిరంతో సమరం జరిపిన దాశరథి – వీరి సాహిత్య వ్యక్తిత్వాలపై యువభారతి నిర్వహించిన ఉపన్యాస మంజరీ కార్యక్రమం - ఈ కవితా లహరి.

SCAN FOR E-BOOK

## 41. ధూర్జటి కవితా వైభవం




ధూర్జటి కావ్య సరస్వతితో పరిచయం లేనిదే తెలుగు సాహిత్యాధ్యయనం అసంపూర్ణం. 16 వ శతాబ్దానికి చెందిన ధూర్జటి, కాళహస్తీశ్వర మహాత్మ్యం, కాళహస్తీశ్వర శతకం వంటి కవితా నిక్షేపాలను తెలుగుజాతికి అందించాడు. పల్లీయుల జీవితాన్ని, ఆటవికుల బ్రతుకుల తీరుతెన్నులను, ఎంతో పనితనంతో వర్ణించిన కవి – ధూర్జటి. భావ శబలతకు, ధారాశుద్ధికి, భక్తిరసానికి, కవితావేశానికి లక్ష్యభూతమైన మహాకవి ధూర్జటి కవిత్వంలోని మాధురీ మహిమను చాటిచెప్పే పద్యాలకు డాక్టర్ పి ఎస్ ఆర్ అప్పారావు గారి సరళ వ్యాఖ్యానమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 42. తులసీదాసు కవితా వైభవం




తులసీదాసు సాహిత్యం నుంచి కొన్ని సుందరమైన, విజ్ఞాన ప్రదమైన, భక్తి రస భరితమైన కవలకు డాక్టర్ భీమసేన్ నిర్మల్ గారి చక్కని తెలుగు వ్యాఖ్యానం.

SCAN FOR E-BOOK

## 43. కవితా లత



కవితా స్వరూప స్వభావాలను చెప్పాలంటే ఉపమాన ద్రవ్యాలుగా ఉపయోగపడే వస్తువులలో స్త్రీ ఉదాత్తమైనది. స్త్రీ స్వరూప స్వభావాలను రూపొందించడానికి తోడ్పడేది – లత. 'కవితా లత' అన్నప్పుడు లతాత్వం కవితకు ఆరోపింపబడి అలంకారధ్వనిగా అతివ శోభిస్తోంది. అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా యువభారతి వనితా విభాగం జరిపిన పోటీలలో ఎన్నికైన మన్నికైన కవితల సంపుటి – ఈ కవితా లత.

SCAN FOR E-BOOK

## 44. నన్నయ కవితా వైభవం



*గాసట బీసటగా జన వ్యవహారంలో ఉన్న భాషను ప్రమాణీకరించి, సున్నితమైన, సమున్నతమైన భావాలను ప్రకటించడానికి అనుకూలంగా తీర్చి దిద్ది, కావ్యరచనకు యోగ్యంగా సమలంకరించి, నన్నయ భట్టు, కవిగా తెలుగు జాతికి ప్రాతః స్మరనీయుడైనాడు. ఆ నన్నయ రమ్యమైన పద్యాలకు, ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారి రుచిర వ్యాఖ్య – ఈ పుస్తకం.*

SCAN FOR E-BOOK

## 45. ధర్మపథం




వేదాలు, పురాణాలు, మహాకావ్యాలు ఎన్నో ధర్మ సూక్ష్మాలను సోపపత్తికంగా తెలుపుతూనే ఉన్నాయి. మన దేశంలో ధర్మం దైనందిన జీవితాలలో పెనవేసుకునిపోయి ఉన్నది. మన ధర్మాల స్వరూప స్వభావాలు, దైనందిన జీవిత వృత్తానికి ప్రామాణికమైన వ్యాఖ్యానాలు, మార్గదర్శక సూత్రాలు, సరళమైన భాషలో వివరించాలనే కుతూహలాన్ని నన్నయ నాటి నుండి నేటివరకు విజ్ఞులు మనదేశంలో ప్రదర్శిస్తూనే ఉన్నారు. ఆ కోవకే చెందిన బహుళ గ్రంథ ప్రణేతలు, సాహిత్య శాస్త్ర రహస్యవేదులుగా విద్వల్లోకానికి చిరపరిచితులైన శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "ధర్మపథం" శీర్షికన ప్రచురించిన కొన్ని వ్యాసాలకు పుస్తకరూపమే ఈ "ధర్మపథం". ఈ ప్రచురణ కలకాలం అక్షరజగత్తులో నిలిచిపోయే ఘంటాపథం.

SCAN FOR E-BOOK

## 46. శతక సౌరభం



శతకం ఆంధ్రుల సాహిత్య కల్పవృక్షం. ఆనందమో, ఆవేశమో, ఉద్వేగమో కలిగినపుడు కవి హృదయ హిమానీశృంగాలనుండి ఉబికి వచ్చిన రసగంగాతరంగాలే, ఈ శతకాలలోని పద్యాలు. కవి అత్మానుభూతికి అద్దాల్లా, పరిదేవనానికి ప్రతీకలుగా సహస్రాధిక సంఖ్యలో వెలువడ్డ శతకాలలోని కొన్ని మరకతాలను ఏరి, వారి కాంతులను డాక్టర్ కె గోపాల కృష్ణారావుగారు పరిచయం చేశారీ చిన్న పుస్తకంలో.

SCAN FOR E-BOOK

## 47. నన్నెచోడ కవితా వైభవం



నన్నెచోడుని కుమారసంభవ కావ్యం నుండి ఎంపిక చేసిన కొన్ని పద్యాలకు డాక్టర్ నిడదవోలు వేంకట రావుగారి సముచిత వ్యాఖ్యానం – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 48. పగలే వెన్నెల




*వాడుకలో ఉండే పదాలూ, పదబంధాలూ, లోకోక్తులూ – చిత్ర సాహితీ నిర్మాణానికి జీవగర్రలు. అందరికీ అర్ధమయ్యేటట్లు, చిత్రకథా వాతావరణానికి సరిపోయేటట్లు మాత్రమే కాక, సాహితీ మర్యాదలను కూడా సంతరించుకునేటట్లు వ్రాయగలగడం అందరికీ సాధ్యం కాని పని. ఐతే, యువభారతికి ఆప్తులు, యువభారతి ప్రారంభదశలో మా కార్యక్రమాలలో చురుకుగా పాలు పంచుకుని మార్గనిర్దేశనం చేసిన జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డాక్టర్ సి నారాయణరెడ్డి గారికి అది నల్లేరుమీద బండి నడక లాంటిదే..!!*

*సాహితీమర్యాదలను సంతరించుకున్న 225 తెలుగు సినీ గీతాల సంకలనం – ఈ "పగలే వెన్నెల".*

SCAN FOR E-BOOK

## 49. సూరదాసు కవితా వైభవం




హిందీ సాహిత్యాకాశంలో తులసీదాసు చంద్రుడైతే, సూరదాసు సూర్యుడు. సూరదాసు చర్మచక్షువులకు నోచుకోకపోయినా ప్రజ్ఞాచక్షువులతో పరాత్పరుని సాక్షాత్కారం పొందిన భాగవతోత్తముడు. శ్రీకృష్ణుని బాల్యక్రీడలను గానంచేసిన ఆయన గీతాలు తెలుగువారికి బమ్మెర పోతనను జ్ఞప్తికి తెస్తాయి. సరళ సుందరమైన భాషకు, ధ్వనిగర్భితమైన అర్ధసంపదకూ, ప్రకృతి సహజమైన వర్ణనలకూ సూరదాసు హిందీ కావ్యజగత్తులో ధ్రువతారగా నిలిచి ఉన్నాడు. అలాంటి సూరదాసు వాంగ్మయం నుండి డా. ఇలపావులూరి పాండురంగారావు గారు ఏర్చికూర్చిన భక్తి వాత్సల్య శృంగార చైతన్య రస వాహిని – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 50. రామాయణ సుధాలహరి




భారతీయుల కుటుంబ వ్యవస్థలో, సాహిత్యంలో, సాంఘిక జీవితంలో, రామాయణ కావ్యం పరోక్షంగానో, ప్రత్యక్షంగానో తన ఉనికిని కనబరుస్తూనే ఉంటున్నది. భారతీయ భాషలలో వెలువడ్డ అనేక రామాయణాలు – వాల్మీకి రామాయణం, తమిళ, మళయాళ, కన్నడ, హిందీ, తెలుగు జానపద రామాయణాలు, రామాయణ కల్పవృక్షం – వీటిపై ప్రముఖుల ఉపన్యాసాల గ్రంథస్థం – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 51. కాళిదాసు కవితా వైభవం




కాళిదాస కవితా సమాలోచనం, భారతీయుల కళా వివేచనమే! మన సంస్కృతిలోని సౌందర్యాంశాలనూ, జీవితోన్నత ప్రమాణాలనూ, ఆదర్శాలనూ వ్యంజించిన ఆయన కవిత, దేశకాలాలు గీచిన గీతలను దాటి నేటికీ ప్రసరిస్తూనే ఉంటుంది. అందుకే ఆయన ఋషి కల్పుడు, విశ్వకవి. కాళిదాసు కావ్యారామంలోని కొన్ని కుసుమాలను దూసి రసపరీమళాలను ఆఘ్రాణించండని ఆహ్వానించిన ధన్యాత్ములు శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు.

SCAN FOR E-BOOK

## 52. తిరుపతి వెంకట కవుల కవితా వైభవం




రాజాస్థానాలకు, పండిత కదంబాలకూ, వైయక్తికమైన కవిసాధనలకూ, గ్రంథాలయాలకూ కట్టుబడిపోయి, అసూర్యం పశ్య గా ఉన్న తెలుగు కవితా వాణిని ప్రజా సందోహానికి అందించి కవిత్వోద్యమ ప్రగమనానికి ఘంటాపథాలు ఏర్పరచిన జంట కవులు — తిరుపతి వెంకట కవులు. వారి కావ్యాలలో ప్రసిద్ధమైన కొన్ని పద్యాలకు, డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యం గారి కమనీయమైన వ్యాఖ్యానం — ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 53. కిరణాలు – కెరటాలు



తలపులకు మలుపులెన్నో .. కవుల తీరులన్ని..!! కొందరు కవుల భావాలు శ్రవణ సుఖాన్నిస్తే, మరికొందరి భావాలు ఆలోచనలను రేపుతాయి. ఆచార్యులవారి కవితలు శ్రవణ సుఖాన్నిస్తూనే, ఆలోచింప జేస్తాయి. "ఖడ్గశక్తి మెరిస్తే కధనం – శబ్దశక్తి విరిస్తే కవనం" "క్షేత్రంలో తడి ఉంటే చెట్టు మొలుస్తుంది – చిత్తంలో తడి ఉంటే కవిత వెలుస్తుంది" –శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య గారి ఈ కవితా సంపుటిలో ఇలాంటి విరుపులు, మెరుపులు – కోకొల్లలు.

SCAN FOR E-BOOK

## 54. గోరా శాస్త్రీయం




గోరాశాస్త్రి గా ప్రణుతి కెక్కిన శ్రీ గోవిందు రామశాస్త్రి గారు అగ్రేసరులైన పాత్రికేయులు, కధకులు, నాటక కర్తలు, వ్యాసకర్తలు. విషయం రాజకీయం గానీ, సాంఘికం గానీ, ఆర్థికం కానీ – వ్యంగ మర్యాదలకు లోపంలేని విధంగా విజ్ఞాప్రడంగా వ్యాఖ్యానించడం ఆయన ప్రత్యేకత. అందువల్లనే 'తెలుగు స్వాతంత్ర్య' లో 'వినాయకుడి వీణ' శీర్షిక క్రింద వెలువడ్డా సమీక్షలు లోకావలోకనాలు, సాహిత్య గౌరవాలు, గోరా శాస్త్రీయాలు. వాటిలో కొన్నింటిని ఏర్చి కూర్చిన కదంబం – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 55. సాహిత్యాధ్యయనం




వివిధ సాహిత్య ప్రక్రియల స్వరూప స్వభావాలతో పరిచయం కలిగించే ఉద్దేశ్యంతో - కవిత్వం, నాటకం, పత్రికలు, నవలలు - వీటిమీద ఉపన్యాసాలనుఏర్పాటు చేసి వాటిని ప్రచురించిన ఈ పుస్తకంలో, శ్రీమతి పరిమళా సోమేశ్వర్, శ్రీ తిరుమల శేషాచార్యులు, శ్రీ పి ఎస్ ఆర్ ఆంజనేయ శాస్త్రి, శ్రీ జి వి సుబ్రహ్మణ్యం గార్ల వ్యాసాలున్నాయి.

SCAN FOR E-BOOK

## 56. బాల భారతి




*ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభల సందర్భంగా వెలువడ్డ ఈ పుస్తకం – శ్రీ న్యాయపతి రాఘవరావు (అన్నయ్య) గారు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరి (అక్కయ్య) గార్ల ఆధ్వర్యంలో 1945 నుండి 1961 వరకు వెలువడి తెలుగుబాలలలో నవచైతన్యం మోసులెత్తించిన "బాల" మాసపత్రికలోని మేలి రచనల వెలుగు హరివిల్లు. సంకలనకర్త శ్రీ వెలగా వెంకటప్పయ్య గారు.*

SCAN FOR E-BOOK

## 57. పాల్కురికి కవితా వైభవం



అచ్చమైన తెలుగులో, చిన్న చిన్న మాటలతో, గొప్పగొప్ప భావాలను తియ్యతియ్యగా చెప్పవచ్చనీ, గాన యోగ్యంగా రచిస్తే ప్రజల నాల్కలే నాళికలుగా కవిత్వాన్ని పారించవచ్చనీ నిరూపించినవాడు పాల్కురికి సోమనాధుడు. తెలుగు ఛందస్సులో మహా కావ్య నిర్మాణం వంటి క్రొత్త సాహిత్య ప్రక్రియలకు నారుబోసిన సోమనాధుని రచనల్లో కొన్నింటియొక్క కవితా పారమ్యాన్ని వివరిస్తుందీ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 58. నవోదయ లహరి



ఒక చీకటి రాత్రిని దాటి ఉషస్సును దర్శించిన ప్రవాహ ప్రగతిని నవోదయం అంటాం. ఆధునికాంధ్ర సాహిత్యలహరికి రాయప్రోలు – ఒక నవోదయం. నాయని – ఒక శుభోదయం. నండూరి – ఒక రాగోదయం. ఆరుద్ర - ఒక అరుణోదయం. కుందుర్తి - ఒక తరుణోదయం. నారాయనరెడ్డి - ఒక నవ్యోదయం. ఇన్ని ఉదయాలను దర్శిస్తూ సాగి వస్తున్న నవ్య సాహిత్య ప్రస్థానంపై సహృదయ సమీక్ష – మా నవ లహరి – మానవ లహరి – 'నవోదయ లహరి'.

SCAN FOR E-BOOK

## 59. విజ్ఞానోదయం




1979 అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ప్రచురించిన ఈ పుస్తకం ధ్యేయం కేవలం వినోదాన్ని కల్పించడమే కాదు. పిల్లల ఆలోచనలకు పదును పెట్టి, పరిసరాలను శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించే అలవాటు చేసుకోవాలనే ఉద్దేశ్యంతో యువభారతి బాలసాహిత్యాన్ని ప్రచురిస్తోంది. విజ్ఞాన శాస్త్ర రంగంలో గణనీయమైన కృషి చేసి ఎన్నో కొత్త విషయాలను కనుగొని మానవాళి అభ్యున్నతికి బాటలువేసిన మహనీయుల జీవిత విశేషాలను శ్రీ రెడ్డి రాఘవయ్య గారు తేలికపాటి పదాలతో, పిల్లలకు అర్ధమయ్యే విధంగా పరిచయం చేశారు.

SCAN FOR E-BOOK

## 60. గోపీచంద్ సాహిత్యం




*గోపీచంద్ బహుముఖీన ప్రజ్ఞా పాటవాలు గల రచయితా, తాత్వికుడు, మనీషి, ఆర్ద్ర మనస్కుడు, కథకుడు, విమర్శకుడు, నవలా రచయితా, చిత్ర నిర్మాత. సమకాలీన సమస్యలను తాత్విక దృష్టితో చిత్రించగలిగిన గోపీచంద్ జీవిత విశేషాలను సరళ సుందర శైలిలో శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు మన ముందుంచారు.*

SCAN FOR E-BOOK

## 61. భారతీయ పునరుజ్జీవనం




పునరుజ్జీవనం (Renaissance) అన్న ఒక్క మాటలో ఆధునిక మానవ నాగరికత అంతా ఇమిడి ఉంది. యూరపు పునరుజ్జీవన మంతటి ప్రతిభా సమన్వితమైనది కాకపోయినా భారతీయ పునరుజ్జీవనం అల్పమైనదేమీ కాదు. యూరపు లో కొన్ని శతాబ్దాల కృషివల్ల సాధ్యమైన గొప్ప ఫలితాలు భారత దేశంలో ఒక్క శతాబ్దం లోనే సిద్ధింపజేసుకోబడినవి. రాజా రామ్మోహన్ రాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు పుట్టిన తరువాత భారతదేశం లోనూ, ఆంధ్రావని లోనూ వచ్చిన మహా పరిణామం చరిత్ర గతినే మార్చివేసిందని విశద మౌతుంది. ఈ అపూర్వ పరివర్తనం ఎలా సంభవించిందీ, దీనివల్ల కలిగిన సత్ఫలితాలేమిటీ అన్న అంశాలను వివేచన చేయడమే ఈ చిన్న పుస్తకం ముఖ్య లక్ష్యం.

SCAN FOR E-BOOK

## 62. రామాయణ పరమార్థం



మిథిల, అయోధ్య, లంక అనే మూడు నగరాల ముచ్చటైన కధ రామాయణం. భారతీయుల దైనందిన జీవితాలల్తో పెనవేసుకు పోయిన ఈ కావ్యం, భారతీయుల ఆదర్శాలకూ, సాంస్కృతిక మర్యాదలకూ మని దర్పణం. రామాయణమొక దర్శనం. ఎవరి దృష్టి ఎలా ప్రసరిస్తే వారికి అలా ప్రత్యక్షమౌతుంది. డాక్టర్ ఇలపావులూరి పాండురంగారావు గారికి ప్రత్యక్షమైనదీ గ్రంధం – రామకధా నవనీతం.

SCAN FOR E-BOOK

## 63. పెద్దన కవితా వైభవం




సాహిత్యాభిరుచి ఉన్న తెలుగువాళ్ళందరికీ పెద్దన సుపరిచితుడు. సౌశీల్యానికీ, సౌందర్యానికీ ప్రవరాఖ్యుడూ; అపురూపమైన అందచందాలకూ, కళావిలాసాలకూ శృంగార రసమూర్తి వరూధినీ; తెలుగువారి దైనందిన జీవితంలో పదబంధాలుగా నిలిచిపోయారు. 16వ శతాబ్దంలో తెలుగు సాహితీ సరస్సులో విరిసిన శతపత్ర కమలం, మను చరిత్రం. అందులోని కొన్ని అందమైన పద్యాలకు డాక్టర్ పల్లా దుర్గయ్యగారి వ్యాఖ్యానం — ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 64. కంకంటి కవితా వైభవం




*కంకంటి వంశ పయః పారావార పరిపూర్ణ సుధాకరుడు, పాపరాజు విరచితమైన 'ఉత్తర రామాయణం' లో 17 వ శతాబ్దం నాటి ప్రజాజీవితం లీలగా గోచరిస్తుంది. సుందరమైన, శ్రవణ సుఖదమైన సమాసాలకు, ధారాశుద్ధి గల పద్యాలకూ ఈ కావ్యం కాణాచి. స్థాలీ పులాక న్యాయంగా ఉత్తర రామాయణ రత్నాకరం లోని రమ్యతర రత్నాలను కొన్నింటిని గ్రహించి కంకంటి కవిత్వ రమ్యతను నమ్రతతో పరిశీలించిన కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి కమనీయ వ్యాఖ్యానం — పుస్తకం.*

SCAN FOR E-BOOK

## 65. కుందుర్తి కవితా వైభవం




'పాతకాలం పద్యమైతే – వర్తమానం వచన గేయం" అన్న శ్రీ కుందుర్తి ఆంజనేయులు అభ్యుదయ కవుల్లో వచన కవితా పరిణామానికి దోహదం చేసినవారిలో అగ్రగణ్యులు. కుందుర్తి 'ఫ్రీ వర్స్ ఫ్రంట్' సాహిత్య చరిత్రలో ఆయన సాగించిన ఉద్యమానికి అక్షరోదాహరణం. ఆయన వచన కవిత ఆధునిక కవితా ప్రస్థానంలో సామాన్యునికి అంకితమైన భాషా కుటీరం కుందుర్తి ప్రతిభా పాటవాలను మనకు ఈ పుస్తకంలో పరిచయం చేసిన వారు – శ్రీ అద్దేపల్లి రామమోహన రావు గారు.

SCAN FOR E-BOOK

## 66. వేడి వెలుగులు




వేడి ఆవేదనకు సంబంధించింది – వెలుగు వివేకానికి సంబంధించింది. కవితకు వేడీ వెలుగూ రెండూ ఉండాలనే హృదయ వాదులు, ఆవేదనతో ఆలోచించడం, హృదయంతో స్పందించడం సహజలక్షణాలుగా ఉన్న యువకవులు, అనుభవించటం కంటే ఎక్కువగా ఆలోచించేవారు, ద్రవించటం కంటే ఎక్కువగా స్పందించేవారు, వక్రోక్తులకంటే స్వభావోక్తులే అలంకారాలుగా ఉపయోగించేవారు, వ్యంగం కంటే హృద్యమైన వాచ్యమే ప్రధానంగా కవితలల్లే వారు, కదిలించడం కంటే, కరిగించడం కంటే, సవరించడం ముఖ్యమని తేల్చి చెప్పిన కొందరు యువభారతీయుల కవితా సంకలనమే ఈ చిన్ని పుస్తకం.

SCAN FOR E-BOOK

## 67. వేగు చుక్కలు



వేగుచుక్కలు అంటే ప్రాతః స్మరనీయులు. ఈ చిన్ని పుస్తకంలో, కందుకూరి వీరేశలింగం పంతులు, అబ్రహాం లింకన్, వల్లభాయి పటేల్, అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు వంటి మహోన్నతుల జీవితాల గురించి పిల్లలు నేర్చుకోవలసిన విషయాలు, అలవరచుకోవలసిన గుణాల గురించి, వారికి అర్థమయ్యేటట్లు తేలిక భాషలో శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారు వివరించారు. అచ్చువేయడానికైన ఖర్చుకన్నా తక్కువధరలో (కేవలం పది పైసలకు మాత్రమే...!) ఈ పుస్తకాన్ని అందజేసిన ఘనత కేవలం యువభారతికి మాత్రమే దక్కుతుంది.

SCAN FOR E-BOOK

## 68. సూర్యుడు కూడా ఉదయిస్తాడు



*తమ మనస్సులను, ఉత్సాహంతో నింపిన తలపులను, తమను ఆలోచనాధీనులుగా చేసిన జీవిత సమస్యలను, నలుగురికీ తెలపాలని ఇద్దరు యువభారతీయులు – విశ్వనాధ సూర్యనారాయణ, జయప్రభ – చేసిన యత్నమే ఈ కవితా సంకలనం.*

SCAN FOR E-BOOK

## 69. మన పురాణ సంకేతాలు




వేదాల నుండి కుమారసంభవాది కావ్యాల వరకూ మనవన్నీ సంకేత ప్రధానమైన గ్రంధాలే. మనం వాడే లిపి, భాష, ముద్రలు, మూర్తులు – అన్నీ ఏవో భావాలకు సంకేతాలే. కొన్ని పురాణ సంకేతాలకు ముదిగొండ శివప్రసాద్ గారి వ్యాఖ్యానం.

SCAN FOR E-BOOK

## 70. మరో జంఘాల శాస్త్రి




ఇటీవలి తెలుగు సాహిత్యంలో కొన్ని పాత్రలు ప్రవేశించాయి. పేరిగాడు, గిరీశం, పార్వతీశం, కాంతం, ఎంకి, రాధ, గోపాలం, బుడుగు, జంఘాల శాస్త్రి – అలాంటి పాత్రలలో కొన్ని. ఇవన్నీ కల్పిత పాత్రలే అయినా, ఒక మనస్తత్వానికీ, ఒక వచో వైఖరికీ, ఒక ఆలోచన ధోరణికీ ప్రతీకలుగా నిలిచిపోయాయి. పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారి "సాక్షి" జంఘాల శాస్త్రి మూసలో సమకాలీన పరిస్థితులపై యువభారతి మాజీ కార్యదర్శి శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారు వ్రాసిన కొన్ని ఉపన్యాసాలు.

SCAN FOR E-BOOK

## 71. ఆలోచనా లహరి



అధ్యయనం పట్ల ఆసక్తిని పెంచేది విమర్శనం. సృజనాత్మక సాహిత్యం ప్రసరించడానికి విమర్శ తోడ్పడుతుంది. తెలుగు సాహిత్యంలో విమర్శ ప్రక్రియను బహుముఖాలుగా విస్తరింపజేసిన ప్రసిద్ధ విమర్శకులు శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డి గారి గురించి డా. చల్లా రాధాకృష్ణ శర్మ గారు, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారి గురించి శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు, శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులు గారి గురించి ఆచార్య బి రామరాజు గారు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి గురించి డా. అక్కిరాజు రమాపతి రావు గారు, శ్రీ ముట్నూరి కృష్ణారావు గారి గురించి డా. ముదిగొండ శివప్రసాద్ గారు, కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి గురించి డా. జి వి సుబ్రహ్మణ్యం గార్ల ఉపన్యాస మణిహారమే ఈ ఆలోచనా లహరి.

SCAN FOR E-BOOK

## 72. శ్రీ శ్రీ కవితా వైభవం




వికసించిన విద్యుత్తేజం శ్రీ శ్రీ. భావ కవిత్వానికి భరతవాక్యం పలికి, అభ్యుదయ కవిత్వానికి ఆవాహన చేసి, అధివాస్తవిక కవిత్వానికి ఆలాపన పాడి, విదూషక వికట కవిత్వానికి ప్రాణం పోసి, విప్లవ కవిత్వాన్ని వీధి కెక్కించిన ఈ శతాబ్దపు కవి వాక్కుకు పరిచయాత్మక వ్యాఖ్యానం. కాలక్రమణికగా సూచించిన ఖండ కావ్యాలలో శ్రీరంగం శ్రీనివాసరావు ప్రతిభ బీజామాత్రంగా మొదలై ఒక మహాదర్శనాన్ని ఎలా సాధించిందో, ప్రభావాల పరిధులను దాటి, ప్రత్యేక ప్రతిపత్తిని ఎలా పొందిందో, డాక్టర్ మిరియాల రామకృష్ణ గారు సరళ సుందరంగా, శక్తిమంతంగా విశ్లేషించి చూపిన ఈ పుస్తకం, శ్రీశ్రీ కవితా ప్రస్థానాన్ని పరిశీలింపదలచుకొన్న సహృదయులకు ఒక చేతిదివ్వె.

SCAN FOR E-BOOK

## 73. రేఖలు




మినీ కవితకొక అర్ధం, రూపం, ప్రయోజనం, పరమార్థం ఉన్నాయని భావిస్తున్న తరుణమిది. ఆ కవితకు పరిమాణమే ప్రమాణమైనా, ప్రవృత్తి ప్రధాన గుణం. తెలుగు మినీ కవితా వినీలాకాశంలో వెలుగు 'రేఖ'లను చిమ్ముతున్న ఒక్కొక్క కవిత, ఒక్కొక్క అనుభవ గుళిక. ఆకృతికి వామనాకారం. తెలుసుకుంటే త్రివిక్రమాకారం. భిన్న రుచుల విభిన్న ధోరణుల హరివిల్లు ఇది. మినీ కవితల విలువల విందు ఇది.

SCAN FOR E-BOOK

## 74. ప్రేమ్ చంద్ జీవితం – సాహిత్యం



సంఘంలో అట్టడుగున పడి ఉన్న రైతుకూలీల జీవితాలను కళ్ళకు కట్టినట్లుగా చిత్రించి పాఠకులలో ఉత్తేజం కలిగించి, సాంఘిక వ్యవస్థలో మార్పు తేవాలని అహర్నిశలూ కృషి చేసిన సాహిత్య శ్రామికుడు ప్రేమ్ చంద్. అభూతకల్పనల నుంచి, ప్రణయలీలావిలాసాల నుంచి హిందీ కథా, నవలా ప్రక్రియలను తప్పించి,గ్రామీణ జీవితాలలో నిక్షిప్తమైన భారతీయతనూ, వాస్తవిక ధోరణినీ, సంస్కారాత్మక ప్రయోజనాన్నీ తన రచనల ద్వారా పరిచయం చేసి కృతార్థుడై, ఆదర్శప్రాయుడైన ప్రేమ్ చంద్ శత జయంత్యుత్సవాల సందర్భంగా ఆయన సాహిత్య, వ్యక్తిత్వాలకు యువభారతి పట్టిన నీరాజనం.

SCAN FOR E-BOOK

## 75. పువ్వులు నవ్వుతున్నాయి :




*"స్వర్గం-నరకం నీ చేతిలోనే ఉన్నాయ్.*
*విప్లవానికి చెయ్యి లేపితే స్వర్గం!*
*బానిసతనానికి చెయ్యి చాపితే నరకం!"*

సంఘం కట్టుబాట్లపై తిరగబడి నలిగిపోయిన "పువ్వులు నవ్వుతున్నాయ"న్న ఈ కవితలు - విప్లవం కోసం శ్రీ గోళ్ళ కుమారస్వామి నాయుడు వెచ్చని సూక్తులను వినిపించే వెలుగు రేఖల ఆశా జ్యోతులు. ఆ పువ్వుల నవ్వుల్లో రవ్వల దివ్వెలు కవ్విస్తాయి.

## 76. పింగళి సూరన కవితా వైభవం




*తెలుగు ప్రబంధ నిర్మాతలలో పింగళి సూరన కొత్త పుంతలు తొక్కిన ప్రయోగ శీలి. మొట్టమొదటి ద్వ్యర్థి కావ్యం – అంటే ఒకే పద్యంలో రెండు రకాలైన అర్థాలను వచ్చేటట్లు వ్రాయబడ్డ కావ్యం – రాఘవ పాండవీయం సూరన్నదే. శ్రీ శ్రీరంగాచార్యులు గారు సూరన్న కావ్యాలలోని కొన్ని పద్యాలను ఏరి, వారిలోని సొగసులను పరిచయం చేసినదీ పుస్తకం.*

SCAN FOR E-BOOK

## 77. కన్నడ సాహిత్య సౌరభం




భారతీయ భాషలలో అంతస్సూత్రం ఒకటే అయినా, బాహిరంగా ఉన్న ప్రత్యేక లక్షణాల వల్ల కొన్ని భాషా కుటుంబాలు ఏర్పడ్డాయి. దాక్షిణాత్య భాషల్లో కన్నడ, తెలుగు భాషలు కొన్ని శతాబ్దాలనుండి చాలా సన్నిహితంగా ఉంటున్నాయి. చరిత్ర పరిశోధకులు, విద్వత్కవులు-శ్రీగడియారంరామకృష్ణ శర్మ గారు, కన్నడ కావ్యాలలోని కొన్ని అందమైన పద్యాలను ఏరి, వాటికి తెలుగు వ్యాఖ్యానం సమకూర్చి కన్నడ కస్తూరిని తెలుగు వారికి అందించారీ పుస్తకంలో.

SCAN FOR E-BOOK

## 78. అయ్యలరాజు కవితా వైభవం




ధారాశుద్ధికి, పద సౌష్టవానికీ, నన్నయవలె నిగ్రహం ఉన్న శృంగార రసపోషణకూ, చెవులకూ మనసుకూ ఇంపైన శబ్దాలంకారాలకూ లక్ష్యప్రాయమైన ప్రబంధంగా రామకధను "రామాభ్యుదయ ప్రబంధం" గా రూపొందించినాడు అయ్యలరాజు రామభద్రకవి. ఆ కావ్యంలోని కొన్ని మంచి పద్యాలను ఏరి, వాటి లోని సొగసులను పరిచయంచేస్తూ ఈ గ్రంధ రచన చేసిన వారు – అయ్యలరాజు రామభద్రుని కవితారీతులపై పరిశోధన చేసి, సిద్ధాంత గ్రంధమును సమర్పించి, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి Ph.D పట్టా పొందిన డా. కొత్తపల్లి విశ్వేశ్వర శాస్త్రి గారు.

SCAN FOR E-BOOK

## 79. కావ్య సందర్శనం




*శ్రీ కృష్ణ దేవరాయల ఆముక్తమాల్యద, తెనాలి రామకృష్ణ కవి పాండురంగ మహాత్మ్యము – తెలుగులో అవతరించిన రెండు మహా కావ్యాలు. ఈ రెండు కావ్యాలూ విష్ణు పారమ్యానికి ఎత్తిన వైజయంతికలు. ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు ఈ రెండు కావ్యాలను గూర్చి చేసిన ప్రసంగాల సారాంశమే ఈ పుస్తకం.*

SCAN FOR E-BOOK

## 80. నారాయణ రెడ్డి సాహితీ మూర్తి



*జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత శ్రీ సింగిరెడ్డి నారాయణ రెడ్డి (సినారె) గారు అగ్రశ్రేణికి చెందిన సాహిత్యాచార్యులు. కవిత్వంలోనూ, జీవితంలోనూ, మానవతనూ చైతన్యాన్నీ రసహృదయాన్నీ పండించుకున్న సాహితీ మూర్తి. అనుక్షణం ఔచిత్యానికి ప్రాణం పోసే సమయస్ఫూర్తి . ఆ విరాణ్మూర్తి సాహిత్యాన్నీ, వ్యక్తిత్వాన్నీ, ఈ పుస్తకంలో ఆయనకు ప్రియ శిష్యులు, యువభారతి ప్రచురణల సంపాదకులు, డా. తిరుమల శ్రీనివాచార్య గారు విస్తృతంగా, వైవిధ్య భరితంగా, సమీక్షాత్మకంగా ఈ గ్రంధంలో వివరించారు.*

SCAN FOR E-BOOK

## 81. వెలుగు బాటలు




మనకు మంచి ఆలోచనలను, మంచి భాషను, ఇవ్వగలిగే శక్తి పుస్తకాలకే ఉంది. ఒక దీపం నుంచి ఒక దీపం ఎలా వెలుగుతుందో, ఒక పుస్తకం నుంచి ఒక మనస్సు అలా వెలుగుతుంది. మన దేశం గురించి, మన సంస్కృతి గురించి,జాతిగర్వించదగ్గమహనీయులజీవితసందేశాల గురించి కేవలం చిన్నపిల్లలను ఉద్దేశించి పుస్తకాలను ప్రచురించే అవకాశం యువభారతికి కలుగజేసినవారు – అశోక్ కుమార్ సంఘి చారిటబుల్ ట్రస్ట్, హైదరాబాద్. వారి ఆర్థిక సహాయంతో ప్రచురించబడ్డ ఈ పుస్తకంలో సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు మొదలుగు వారి జీవిత విశేషాలు సరళ భాషలో వివరించబడ్డాయి.

SCAN FOR E-BOOK

## 82. త్యాగరాజస్వామి భక్తి కవితా వైభవం



కవిత్వం అంటే కాళిదాసు గుర్తుకు వచ్చినట్లే, సంగీతమంటే త్యాగయ్య మనసులో మెదులుతాడు. ఆయన తపస్సు – భక్తి, సాహిత్యం, సంగీతము అని – మూడు పాయలుగా ప్రవహించింది. ఆయన కీర్తనలు భక్తి పారవశ్యానికి శబ్దరూపాలు. భారతీయుల ఆత్మకు ప్రతీకలు. రాజాశ్రయాన్ని కూడా నిరసించి నాదబ్రహ్మోపాసన జీవిత లక్ష్యంగా, తన సంగీతంతో, తన నిర్మల జీవితంతో, తన ఉత్తమ కవిత్వంతో ప్రజా బాహుళ్యాన్ని పునీతం చేసిన ఆ ఋషికల్పుని కీర్తనలలో కొన్నింటిని ఏరి, సులభమైన వివరణతో శ్రీ ఆకెళ్ళ అచ్యుత రామమ్ గారు ఈ పుస్తకంలో అందించారు.

SCAN FOR E-BOOK

## 83. అడుగుజాడలు




చెప్పే నీతులకు, చేసే చేతలకు పొంతన సాధించిన మహానుభావులను వేళ్ళమీద లెక్కించవచ్చు. మహాత్మా గాంధీ,లాల్ బహదూర్ శాస్త్రి, సోక్రటీస్ మొదలైనవారు, వారు ప్రతిపాదించి, ప్రచారం చేసిన సిద్ధాంతాలను ఆచరించి చూపిన వారు. ఆ ప్రాతఃస్మరణీయుల జీవిత మధనం నుండి చిందిన సుధాబిందువులు చిన్న పిల్లల మనసులకు అంటేటట్లు, యువభారతి పూర్వాధ్యక్షులు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారు వ్రాసిన ఈ పదహారు పేజీల పుస్తకం – కేవలం పది పైసలకు అందించబడింది.

SCAN FOR E-BOOK

## 84. ఉపనిషత్సుధ




*భారతీయుల తత్వ జిజ్ఞాసకు ప్రతీకలు ఉపనిషత్తులు. జీవునికీ, దేవునికీ మధ్య ఉన్న ఆంతర్యాన్నీ సత్యగవేషణా దృక్పథాన్నీ, మహోన్నత జీవితాదర్శాన్నీ, ఉపనిషత్తులు విశ్లేషిస్తాయి. వందకు పైగా ఉపనిషత్తులను వెలయించిన అక్షరభారతి వేదమండలానికి క్షీరసాగరం లాంటిది. అందులోనుండి అందుకోగలిగినంత అక్షరసుధను సేకరించి, అందరికీ అందించగలిగినంత వరకు అందించాలనే డాక్టర్ ఇలపావులూరి పాండురంగారావు గారి ఆరాటానికి అక్షరాకృతి ఈ ఉపనిషత్సుధ.*

SCAN FOR E-BOOK

## 85. తమిళ సాహిత్యం – భారతి కవిత




సుప్రసిద్ధ తమిళ కవి, స్వాతంత్ర్య సమరయోధుడు, మహా మనీషి, ఆధునిక తమిళ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి శతజయంత్యుత్సవ సంవత్సరంలో, డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మగారు నిష్టతో ఆయన రచనలు కొన్నింటిని తెలుగులోకి అనువాదం చేయగా, ఆ వ్యాసానికి యువభారతి రూపం కల్పించిన పుస్తకం.

SCAN FOR E-BOOK

## 86. ఇతిహాస లహరి




భారతదేశ ఇతిహాసంలో స్వాభిమానం కోసం, స్వదేశ, ధర్మ, సంస్కృతీ పరిరక్షణ కోసం అంకితమై అసువులు బాసి, మాతృదేశ ఋణం తీర్చుకున్న మహనీయులెందరో ఉన్నారు. వారే ఇతిహాస నిర్మాతలు, ఆదర్శ జీవులు, ప్రాతఃస్మరణీయులు. వారి జీవితేతివృత్తం ఇతిహాసమనిపించుకుంటుంది. కావ్య గౌరవాన్ని సంపాదించుకున్న ఆరు ప్రసిద్ధ తెలుగు ఇతిహాసాలను దిన్మాత్రంగా యువతరానికి పరిచయం చేయాలన్న ఉద్దేశ్యంతో నిర్వహించిన లహరీ కార్యక్రమం – ఇతిహాస లహరి. 'శివభారతం', 'ఆంధ్రపురాణము', 'ఝాన్సీ రాణి', 'రాణాప్రతాపసింహ చరిత్రము', 'పోతన చరిత్రము', 'వందేమాతరం' కావ్యాల గురించి డాక్టర్ ప్రసాదరాయ కులపతి, డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యం, డాక్టర్ తుమ్మపూడి కోటేశ్వరరావు, డాక్టర్ ముదిగొండ శివప్రసాద్, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డాక్టర్ అక్కిరాజు రమాపతి రావు గార్ల ఉపన్యాస పాఠాల ప్రచురణే – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 87. మరో జంఘాల శాస్త్రి – II




మహాకవి, నాటక కర్త, అశేష శేముషీ సంపన్నుడు, శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు సృష్టించిన జంఘాల శాస్త్రి పాత్ర – ఒక వైఖరికి ప్రతీక. ఒక ఆలోచనా సరళికి సూచిక, పరిహాస భావ పేటిక. ఆ ధోరణిలో, ఆ ఊపులో, ఆ పదజాల ప్రయోగంతో, యువభారతి మాజీ కార్యదర్శి శ్రీ ఆయల సోమయాజుల నాగేశ్వరరావు గారి రచన – అధిక ప్రజాదరణ పొందిన మొదటి పుస్తకానికి మలి మజిలీ.

SCAN FOR E-BOOK

## 88. జానపద సాహిత్యం




కేవలం సాహిత్యానికి సంబంధించిన అంశాలనే కాక, సమాజాన్ని, సంస్కృతిని అవగాహన చేసుకునేందుకు తోడ్పడే అంశాలను కూడా పఠనాసక్తి ఉన్న అక్షరాస్యులకు అందించాలని యువభారతి ఆశయం. ఈ కృషిలో భాగంగా అనాదృత వాంగ్మయంగా పండితుల పరిశీలనకు నోచుకోని జానపదుల గేయాలనూ, కధలనూ, విజ్ఞానాన్నీ, వినోదాలనూ, బ్రతుకు బరువులనూ, శ్రీ ఆర్వీయస్ సుందరం గారు ఒక పరిచయాత్మక దృష్టితో విశ్లేషించిన వ్యాస సంకలనం.

SCAN FOR E-BOOK

## 89. అభినవ లోచనం




కవిత, కథ, నవల, నాటకం వంటి సృజనాత్మక సాహిత్య ప్రక్రియల అధ్యయన పరిధిని విస్తృత పరచడంలోనూ, సాహిత్యం పట్ల సదవగాహన పెంపొందించడంలోనూ, ఉత్తమ సాహిత్య విలువలను కాపాడుకొనడంలోనూ, విమర్శ సాహితికి విశేష ప్రాధాన్యమున్నది. ఈ పుస్తకం – 'రాయప్రోలు సుబ్బారావు', 'లాస్య కింకిణి', 'భావసౌరభము', 'విశ్వనాధ కల్పవృక్షం', 'విమర్శక చక్రవర్తి విశ్వనాధ', 'రాయప్రోలు వారి మాధురీ దర్శనం', 'ఆంధ్ర పురాణం', 'కవితాధ్యయనం' అన్న ఎనిమిది సాహిత్య విమర్శనాత్మక వ్యాసాల సంకలనం. పాత కొత్త సాహిత్యాల పరామర్శను, నిన్నటి-నేటి తరం కవుల ప్రతిభా సామర్థ్యాలను ఈ వ్యాసాలలో డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యం గారు వినూత్నమైన ధోరణిలో, సరళ సుందరమైన భాషలో వివరించారు.

SCAN FOR E-BOOK

## 90. ఆంధ్ర సాహిత్య విమర్శ ఆంగ్ల ప్రభావం




దాదాపు మూడు శతాబ్దాల నుండి ఆంగ్ల భాషా సంస్కృతులతో తెలుగువారికి సంబంధం ఏర్పడింది. రాజకీయ ప్రాబల్యం దీనికి ప్రధాన కారణమే అయినా, సామాజికంగా, భాషాపరంగా, సాహిత్యాత్మకంగా ఆంగ్ల ప్రభావంతో తెలుగు భాషా సాహిత్యాలు కొత్త పుంతలు తొక్కగలిగాయి. ఆంగ్ల భాషా గవాక్షం నుండి విశ్వాన్ని, విశ్వ సాహిత్యాన్ని, ముఖ్యంగా పాశ్చాత్య భావ ప్రపంచాన్ని తెలుగు ప్రతిభ చూడగలిగింది. ఈ పుస్తకంలో, డా. జి వి సుబ్రహ్మణ్యంగారు వ్యక్తపరచిన భావాలు, సాహిత్య వికర్శకే కాక, భావ సమైక్యానికి కూడా దోహదం చేస్తాయి.

SCAN FOR E-BOOK

## 91. రవ్వలు




యువభారతి సాహితీ కృషిలో చేయూతనిస్తున్న వారిలో 'సాహితీ మిత్రు'లు, 'భారతీ మిత్రు'లు, 'భారతీ భూషణు'లు ఎందఱో ఉన్నారు. వారిలో కొందరు కవులు, కథకులూ, విమర్శకులూ కూడా ఉన్నారు. వీరి ప్రతిభా స్పర్శతో తన ప్రచురణలను సువర్ణమయం చేసుకోవాలని సమకట్టిన యువభారతి ఇంతవరకు 'వీచికలు', 'అక్షరాలు', 'స్వరాలు', 'వేడి వెలుగులు', 'ఉషస్సు', 'ఉదయం', 'కథావాహిని' వంటి కవితా, కథా సంకలనాలను ప్రచురించింది. ఈ 'రవ్వలు' వాటి సరసన నిలిచే పుస్తకం. ఝుటిత స్ఫూర్తితో తళుక్కుమనే ఈ (సాదా) 'మినీ కవిత'లలో అర్థం శంపాలతాసన్నిభంగా ఒక్కసారి మెరిసి ఆశ్చర్యంలో, ఆనందంలో, ఆలోచనలో ముంచుతుంది.

SCAN FOR E-BOOK

## 92. వెలుగు చూపే తెలుగు పద్యాలు




*విద్య యొక్క విలువ గురించి, దాని గొప్పదనం గురించి, దాని అవసరం గురించి, అది మనకు ఇచ్చే వివేకం గురించి, చిన్న చిన్న తెలుగు పద్యాలను ఉదాహరిస్తూ, డా.ఇరివెంటి కృష్ణమూర్తి గారు పిల్లలకోసం రచించిన ఒక మణిపూస వంటి పుస్తకం. వెల కేవలం పది పైసలే..!!*

SCAN FOR E-BOOK

## 93. తెలుగు వాగ్గేయకారులు :




ఈ పుస్తకంలో, డాక్టర్ ఎస్ గంగప్పగారు, పదకవిత ఆవిర్భావ వికాసాల్ని, పద కవిత నిర్వచనం, వాగ్గేయకారుని గురించి ఉపోద్ఘాతంగా తెలిపి, అన్నమాచార్యునితో ఆరంభించి, ఆయన పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, క్షేత్రయ్య, నారాయణ తీర్థులు, రామదాసు, సారంగపాణి, పోతులూరి వీరబ్రహ్మం, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి, త్యాగరాజ స్వామి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ గార్ల గురించి రేఖామాత్రంగా పరిచయం చేసారు.

SCAN FOR E-BOOK

## 94. అన్నమయ్య




పదిహేనవ శతాబ్దిలో అవతరించి, ప్రజా సామాన్యంలో ప్రచారంలో ఉన్న పదాలను ఆదరించి, భక్తితో, సంగీతంతో, సాహిత్యంతో వాటిని పునీతం చేసి, తెలుగు పలుకుబళ్ళను వాటిలో చొప్పించి, మహోదాత్త భావవాహికలుగా వాటిని తీర్చి దిద్ది, వేల వేల పదాలను ఆ వేంకటేశ్వరుని పాదాలకు అర్పించిన 'పదకవితా పితామహుడు' అన్నమయ్య జీవితాన్నీ, ఆయన రచనల విశేషాలనూ, డాక్టర్ ముట్నూరి సంగమేశం గారు క్లుప్తంగా సరళంగా తెలుగు పాఠకలోకానికి అందించారు.

SCAN FOR E-BOOK

## 95. మాఘ కావ్య వైభవం




ఉపమాలంకారాలను చెప్పడంలోనూ, గంభీరమైన అర్థాలను గుబాళించే కవితలను వెలయించడంలోనూ, మృదులమైన పదాలను ఇంపుసొంపు లొలికేటట్లు ప్రయోగించడంలోనూ అందెవేసిన చెయ్యిగా పేరొందిన మాఘుని 'శిశుపాల వధ' కావ్యంలోని కొన్ని శ్లోకాలకు శ్రీ కె వి రాఘవాచార్యులు గారి రమ్యమైన వ్యాఖ్యానం — ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 96. వివేకానంద కవితా వైభవం




భారతీయుల తత్త్వ జిజ్ఞాసను ఖండాంతరాలలో వెదజల్లి, ఈ వేదభూమికి గొప్ప ఆదర గౌరవాలను సంపాదించి పెట్టిన మహనీయుడు — స్వామి వివేకానంద. నిరీహుడై, నిస్సంగుడై, భారతీయుల్లో ఆత్మవిశ్వాసాన్నీ, సేవానురక్తినీ, దేశభక్తినీ ధర్మాభిరతినీ కలిగించడానికి తపస్సు చేసిన మహా మనీషి ఆయన. స్వామీ వివేకానందుడు సంస్కృత, వంగ, ఆంగ్ల భాషలలో కవితా సృష్టి చేసినాడు. శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి గారు వివేకానందుని కొన్ని సంస్కృత కవితలకు వ్రాసి ఇచ్చిన కమనీయ వ్యాఖ్యలే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 97. సంస్కృతి



మనిషి మానవుడుగా రూపొందడం సంస్కృతి. పాశవిక దశనుండి ఎదిగి, సహజాతంగా సంక్రమించిన పశు లక్షణాలను నిగ్రహించుకొని, సాంఘికాభ్యుదయం కోసం వ్యక్తిత్వాన్ని మలచుకోవడం సంస్కృతి. ప్రపంచంలో బహు దేశాలు కన్నువిప్పక పూర్వమే భారతదేశంలో పారమార్ధిక జ్ఞానం రెక్క విప్పింది. భారతీయ సంస్కృతికి, అందులోనూ ముఖ్యంగా ఆంధ్ర సంస్కృతికి చెందిన కొన్ని అంశాలను, చక్కని చిక్కని భాషలో, డాక్టర్ ప్రసాదరాయ కులపతి గారు, సోదాహరణంగా ఈ పుస్తకంలో వివరించారు.

SCAN FOR E-BOOK

## 98. వాగ్భూషణం భూషణం



చక్కని వచోరీతి వ్యక్తిత్వానికి సమగ్రతను ప్రసాదిస్తుంది. నిద్రాణమైన మనశ్శక్తి జాగృతం కావాలంటే వక్తృత్వ కళ ను ఉపాసించడం ఒక సాధనం. చక్కగా, మనోజ్ఞంగా ఇతరుల మనసులకు హాయి కలిగేటట్లు, చీకటిలో దివ్వె వెలిగినట్లు, సంభాషించడం నిజంగా ఒక వరం. ఈ వక్తృత్వ కళారాధనం అక్షరాస్యులకు లక్ష్యం కావాలని, సంస్కృతీ పరిరక్షణకు పునాది కావాలన్న ఆశయంతో, ఆ కళను అలవరచుకోవాలన్న వారికి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారు కొన్ని మెళకువలు, సూచనలు చేశారీ పుస్తకంలో.

SCAN FOR E-BOOK

## 99. వెలుగు రేఖలు




యువభారతి లో సభ్యులుగా ఉన్న కవుల, విమర్శకుల, కధకుల, రచనలను యువభారతి ప్రచురణలుగా వెలుగులోకి తేవాలన్న ఉద్దేశ్యంతో ఒక ప్రత్యేక పథకం ద్వారా వెలువరించిన శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడు గారి కవితా సంకలనం.

SCAN FOR E-BOOK

## 100. సంస్కృత సాహితీ లహరి



సంస్కృత సాహిత్యంతో పరిచయం అంటే భారతీయత తోనే పరిచయం; మానవతా దృక్పథం తోనే పరిచయం. విశ్వ సాహిత్యంలోనే నిత్య నూతన భావసృష్టికి, తాత్త్విక సృష్టికి, జీవిత పరమార్థానికి, కవితా పారమ్యానికి, భారతీయ ఆలోచనా ఫణితికి, సౌందర్యానుభూతికి ప్రతీకలుగా నిలిచిన ఆరు సంస్కృత నాటకాలను ఎన్నుకొని, యువభారతి 20 వ వార్షికోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేసిన 'లహరి' ఉపన్యాసమంజరీ కార్యక్రమంలో భాసుని 'స్వప్న వాసవదత్తం', శూద్రకుని 'మృచ్ఛకటికం', కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలం', భవభూతి 'ఉత్తరరామచరితం', శ్రీహర్షుని 'నాగానందం' విశాఖదత్తుని 'ముద్రారాక్షసం' నాటకాలపై ప్రసిద్ధాంధ్ర సాహిత్యవేత్తలు శ్రీ మానాప్రగడ శేషసాయి, డా. పుల్లెల శ్రీరామచంద్రుడు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా. ధూళిపాళ శ్రీరామమూర్తి, శ్రీ కొత్తపల్లి ఘనస్యామల ప్రసాద రావు, శ్రీ అవధానం చంద్రశేఖరశర్మ గార్ల ఉపన్యాసాల సారం ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 101. తెలుగులో స్వీయ చరిత్రలు




భారతదేశపు ఆధునిక చరిత్రను, అనేక కారణాల వల్ల, ముందు తరాల వారు స్థిరంగా మననం చేయవలసి ఉంటుంది. కాలసంద్రపు సైకతతీరాలలో మహాపురుషుల అడుగుజాడలు మానవాళికి మనోనిబ్బరం ప్రసాదిస్తాయి. చరిత్రను సృష్టించిన మహాపురుషుల, విశిష్ట వ్యక్తుల స్వీయ జీవితానుభవాలను గ్రంథస్థం చేసినపుడు, వాటి నుండి జాతి జనులు స్ఫూర్తిని పొందగలరు. వివిధ రంగాలలో ఉత్తమ కృషి చేసిన వ్యక్తుల స్వీయచరిత్రల ద్వారా తెలుగు వారికి వారందించిన సంస్కారాన్ని సంక్షేపంగా పరిచయం చేయడానికి చేసిన చిన్న ప్రయత్నమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 102. దేశమును ప్రేమించుమన్నా



తల్లి దండ్రులను, గురువును దగ్గర నుండి మాతృదేశం దాకా, మహాత్మా గాంధీ నుండి మహాభారతం దాకా చిన్న చిన్న పదాలతో, చిన్న పిల్లలకు అర్థమయ్యే రీతిలో శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారు, ఈ చిన్న పుస్తకంలో వివరించిన తీరు అనితర సాధ్యం. ఆయన, శ్రీ గురజాడ అప్పారావుగారి 'దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచుమన్నా' అన్న దేశభక్తి గీతం అర్థాన్ని బహు గొప్పగా చెప్పారీ పుస్తకంలో.

SCAN FOR E-BOOK

## 103. తెలుగు జానపద కథలు




నాగరికుల కథలకు బీజాలు జానపదుల కథలే. అనుభవాలను పంచుకోవాలన్న కోరిక పుట్టినప్పుడే కథ పుట్టింది. ఈ జానపదుల కథలలో అతిశయోక్తు లుండవు. కళలు, నమ్మకాలు ఉంటాయి. కథా ఘట్టాలకు వాళ్ళ సంబరాల, శ్రామిక జీవితాల స్పర్శ ఉంటుంది. జానపద విజ్ఞానాన్ని తలస్పర్శిగా అధ్యయనం చేసిన డాక్టర్ జి.ఎస్.మోహన్ గారి ఈ పుస్తకం పరిమాణంలో చిన్నదైనా, గుణం దృష్ట్యా, ప్రయోజనం దృష్ట్యా మిన్నయైనది.

SCAN FOR E-BOOK

## 104. దశరూపక సందర్శనం




యువభారతి నెలనెలా నిర్వహించే "సమాలోచనం" కార్యక్రమంలో, ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారి "విషాద సారంగధరం", వేదం వెంకటరాయ శాస్త్రి గారి "ప్రతాపరుద్రీయం", శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి "బొబ్బిలియుద్ధం", చిలకమర్తి వారి "గయోపాఖ్యానం", పానుగంటి వారి "పాదుకా పట్టాభిషేకం", గురజాడ వారి "కన్యాశుల్కం", తిరుపతి వెంకటకవుల "పాండవోద్యోగం", బలిజేపల్లి లక్ష్మీకాంతం గారి "సత్య హరిశ్చంద్రీయం", కాళ్ళకూరి నారాయణరావు గారి "వరవిక్రయం", విశ్వనాధ సత్యనారాయణ గారి "నర్తనశాల" నాటకాలపై, సుప్రసిద్ధ సాహితీ వేత్తలు - పి ఎస్ ఆర్ అప్పారావు గారు, డా. వి. వి. ఎల్. నరసింహారావు గారు, డా. అమరేశం రాజేశ్వర శర్మగారు, డా. ముక్తేవి భారతి, డా. ముదిగొండ వీరభద్ర శాస్త్రి గారు, డా. ఓగేటి అచ్యుతరామ శాస్త్రి గారు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు, డా. గంగిరెడ్డి లక్ష్మీనారాయణ గారు, రాజా రామదాస్ గారలు ఇచ్చిన ఉపన్యాస పరంపరకు అక్షరరూపం ఈ పుస్తకం. పదినాటకాలు ఇందులో పరిచయం చేయబడ్డాయి కాబట్టి దశరూపక మన్నారు. పరిచయాత్మకమైన ఈ వ్యాసాల్లో, ఆ నాటక శిల్పమూర్తులు ప్రత్యక్షమౌతున్నవి కాబట్టి సందర్శనమన్నారు. ఈ దశరూపక సందర్శనం — ఆంధ్రుల దృశ్య కావ్య కళా సౌందర్యానికి అమర్చిన నిలువుటద్దం.

SCAN FOR E-BOOK

## 105. చిలకమర్తి కవితా వైభవం



తన ప్రజ్ఞా చక్షువులతో లోకాన్ని సందర్శించి, పండిత పామరులకు అందుబాటులో ఉండే శైలిలో రచనలు సాగించి, తెలుగు పఠితృ లోకానికి వినోదాన్ని పంచి ఇచ్చిన మహనీయులు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి సాహిత్య సింధువును చిలికి, నవనీత సదృశములైన కొన్ని పద్యాలను తీసి, వాటికి సరళమైన వ్యాఖ్యానాన్ని వెలయించారు డాక్టర్ ముక్తేవి భారతి గారు – ఈ చిన్ని పుస్తకంలో.

SCAN FOR E-BOOK

## 106. తిక్కన రసభారతి



మహాభారతం వంటి ఇతిహాసాన్ని మనకు కావ్యంగా మలచి ఇచ్చి, మన భాషకు ఒరవడి నీ, మన కవితకు ఆదర్శాన్ని, మన సంస్కృతికి ప్రమాణాలనూ అందించిన మహా మహితాత్ములు – కవిత్రయం వారు. అందులో పదిహేను పర్వాలను తెనిగించిన తిక్కన గారి పద్యాలలో కొన్నింటిని ఎన్నుకుని, వాటిలో ఆయన పోషించిన రసస్వరూపాన్ని, డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి గారు ఈ పుస్తకంలో మనకు సాక్షాత్కరింపజేశారు.

SCAN FOR E-BOOK

## 107. కృష్ణశాస్త్రి కవితా వైభవం




స్వేచ్ఛ కోసం అలమటించి, మానవతకు నీరాజనం పట్టి, సౌందర్య దాహంతో తపించి, ఊర్వశీ మూర్తిని యెద నిల్పుకొని, ప్రణయంలో, ప్రకృతిలో, ఈశ్వరుని దర్శించి, “ప్రతి మనిషీ నడిచే దైవం” అని నమ్మిన మహాకవి శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి. మనోజ్ఞమైన ఆయన కవిత్వోద్యానవనంలో ప్రతి చెట్టునూ, పుట్టనూ, పువ్వునూ, రెమ్మనూ పేరు పేరునా పరిచయం చేయడం అసాధ్యమైనా, ఆ మహాకవి కవితా పరిమళాన్ని డా. కడియాల రామమోహన్ రాయ్ గారు ఈ పుస్తకం ద్వారా ‘చూపుడు వేలితో చందమామను చూపినట్లు’ సాహితీ జిజ్ఞాసువులకు చూపించారు.

SCAN FOR E-BOOK

## 108. జననీ జన్మభూమిశ్చ




అలౌకికానుభూతులకు అద్దం పట్టిన ఆర్ష వాంగ్మయ సారమే శ్రీమద్రామాయణం. మృదుమధురమైన భాష, దానిని మించిన శయ్య, దాన్ని త్రోసి రాజనే శైలి, అహమహమికతో వాల్మీకి రసనాగ్ర రంగస్థలిపై రసమయ రమణీయ నృత్యం చేశాయి. సమాజంలోని అన్ని వర్గాలకు, వృత్తులకు, సామాన్యులకు కూడా ఆదికవి హృదయం అందుబాటులోకి వచ్చేటట్లు డా. ఎస్.బి.రఘునాదాచార్య గారు, కొన్ని మూల శ్లోకాలకు సరళ సులభ వ్యాఖ్యను ఈ పుస్తకంలో పొందు పరిచారు.

SCAN FOR E-BOOK

## 109. వ్యాస సూక్తం




వ్యాస సాహితి విజ్ఞాన సర్వస్వం. దేశ కాల పాత్రోచిత పరివర్తన లకు అనుగుణంగా ఆ ప్రతిభాశాలి అందించిన భావ సంపద అనంత రూపాలతో సాక్షాత్కరిస్తూ ఉంటుంది. ఆయన సుధాకరం లో నుంచి కొన్ని శ్లోకాలకు డా. కె. కమల గారి సరళ వ్యాఖ్యానమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 110. వ్యాస సాహితీ సంహిత



వ్యాస సాహిత్యం భారతీయ జీవితాలను, సాహిత్యాలను విస్తృతంగా ఆవరించింది. గీతావాక్యం చోటు చేసుకొని జీవిత సంఘటనం ఉండదు. భారత కథను ఉదాహరించని జీవన విన్యాసం ఉండదు; గోవిందనామ స్మరణం చేయని సత్సంగం ఉండదు. భాగవతార్ధ స్పర్శ లేని ఆధ్యాత్మిక చింతనం ఉండదు పురానార్త ప్రసక్తి లేని జీవిత వ్యవస్థ ఉండదు. కర్మ, భక్తి, జ్ఞాన ప్రపత్తులన్నీ వ్యాస సాహితిలో ఉపజీవించేవే. వ్యాస సాహితి కావ్యలతలకు కల్పకోద్యానం, జీవన తరంగిణులకు హిమవన్నగ శృంగం; జాతి సంస్కృతికి జీవగర్ర. వేదవ్యాసుని సాహిత్యంపై డా. ఎస్ బి రఘునాథాచార్య, డా. రత్నాకరం బాలరాజు, డా. ధూళిపాళ శ్రీరామమూర్తి, శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రి, శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ, డా. ప్రసాదరాయ కులపతి, డా. పుల్లెల శ్రీరామచంద్రుడు, డా. కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాద రావు, డా. దివాకర్ల వెంకటావధాని గార్ల ఉపన్యాసాల సంకలనం – ఈ వ్యాస సాహితీ సంహిత.

SCAN FOR E-BOOK

## 111. చాటువులు




చాటు కవిత్వం అంటే – అందంగా ఆహ్లాదంగా ఉండే కవిత్వం. ఆశు కవిత్వ ప్రక్రియ, కావ్య కవిత ప్రక్రియ, గాథా కవిత్వ ప్రక్రియ – ఈ మూడింటి లోని ముచ్చటైన గుణాలను తనలో రంగరించుకొన్న ముత్యం వంటి ప్రక్రియ – ఈ చాటు కవిత్వం. చాటు పద్యాలు ప్రజల నాల్కలమీద నివసిస్తూ ఉంటాయి. సమాజంలో విలువలు మారుతున్నప్పుడూ, విభిన్న ధోరణులు వెలుగులోకి వస్తున్నప్పుడూ, కొన్ని చాటువులు కాల గర్భంలో కలిసిపోతుంటాయి. అప్పుడు, ఇరివెంటి కృష్ణమూర్తి గారి వంటి మహామనీషులు, ఇటువంటి పుస్తకాలను వ్రాసి, వాటిని మరలా జాతికి జ్ఞాపకం చేస్తూ ఉంటారు. మన్నిక గల పద్యాలకు ఆయన మనసుతో చేసిన వ్యాఖ్యానమే, ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 112. ప్రస్తుతం అందుబాటులో లేదు

## 113. ప్రస్తుతం అందుబాటులో లేదు.

## 114. జ్ఞానపదులు జానపదులు




జానపదుల కళామయ జీవితాన్ని పరిచయం చేయడంతో బాటు, భారతీయుల ప్రతిభా పాండిత్యాలకు, సంస్కృతికి ప్రాతినిధ్యం వహిస్తూ , తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కొందరు ప్రతిభామూర్తులను గురించి, యువభారతికి సన్నిహితులు, శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు చేసిన కొన్ని ప్రసంగాలు, వ్రాసిన కొన్ని వ్యాసాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 115. జగద్గురు సాహితీ లహరి




శంకరుల వివేక వైభవాన్ని, కవితా పారమ్యాన్ని, ప్రత్యక్షంగా సంస్కృతం నుండి, పరోక్షంగా ఇతర భాషలనుండి గ్రహించి, అర్ధం చేసుకుని, ఆనందించి, తరించి, కృతార్ధుడు కాని భారతీయుడు లేదంటే సాహసం కాదు. వ్యాసప్రోక్తమైన మహాభారతం లోని విష్ణు సహస్ర నామాలకూ, భగవద్గీతకూ, ఇంకా వ్యాసుని బ్రహ్మ సూత్రాలకూ, ఉపనిషత్తులకూ ప్రామాణిక వ్యాఖ్యానాలు వెలయించి పాండిత్యానికి ఉండవలసిన ప్రయోజనాన్ని భంగ్యంతరంగా నిరూపించుకుని, శంకరులు ఆదర్శ శిఖరంగా వెలుగొందారు. ఆయన వ్యాఖ్యాన సాహితి, భారతీయ ప్రతిభకు వైజయంతిక. ఆయన ప్రపంచ సార తంత్రం అతి నిగూఢమైన మంత్రం శాస్త్ర పరిజ్ఞాన కోశం.

శంకర భగవత్పాదుల సాహిత్యంపై ప్రసిద్ధ సాహిత్యవేత్తలు శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, డా. కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు, శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రి, శ్రీ భాగవతుల కుటుంబరావు, డా. ఇలపావులూరి పాండురంగారావు, డా. పుల్లెల రామచంద్రుడు,డా. దివాకర్ల వేంకటావధాని గారల ఉపన్యాస వ్యాస మంజరి – ఈ జగద్గురు సాహితీ లహరి.

SCAN FOR E-BOOK

## 116. బాబా ఫరీద్ సూక్తులు




బాబా ఫరీద్ 12 వ శతాబ్దానికి చెందిన మహనీయుడు. ఇస్లాం మతానుయాయి. అయినా ఆయన సూక్తుల్లో మతం గీసిన గీతలేమీ కనిపించవు. ముస్లిములు భారతదేశంలో స్థిరపడిపోయి, ఇక్కడ ప్రజలతో కలిసిపోవడానికి ఫరీద్ వంటి మహనీయులే కారణం. ఏడువందల ఏళ్ళలో సమైక్య జీవన సరళికి అనువైన ఆలోచనలను, బ్రతుకు తీరును అందించినవారు – ఫరీద్ వంటి వారే. బాబా ఫరీద్ తత్త్వ చింతన ఉపనిషత్తుల బాటలలోనే సాగింది. మన భక్తి సాహిత్యం అడుగు జాడల్లోనే నడిచింది. హిందీ లోనూ, తెలుగులోనూ అనేక కవితలనూ, వ్యాసాలనూ వ్యాఖ్యానాలనూ వెలయించి సమున్నత ప్రమాణాలను అందుకున్న సాహితీ స్రష్ట, డా. ఇలపావులూరి పాండురంగారావుగారు, బాబా ఫరీద్ సూక్తులను అచ్చమైన తెలుగు నుడికారంతో, ఈ పుస్తకం రూపంలో మనకు అందించారు.

SCAN FOR E-BOOK

## 117. నన్నయ భట్టు




ఆంధ్ర మహాభారతం - కావ్యరచనకే కాదు, ఆంధ్రీకరణ విధానానికీ, చక్కని తెలుగు నుడికారపు ఇంపు సొంపులకు, నాదమాధురికీ, అర్థగాంభీర్యానికీ కాణాచి. ఈ చిన్న పుస్తకం నన్నయ సాహిత్య వ్యక్తిత్వానికి అద్దం లాంటిది. మహాభారత ప్రశస్తి తో పాటు, నన్నయ ప్రతిభ, విజ్ఞాన నిరతి, కవితా పారమ్యం ఈ పుస్తకంలో సాక్షాత్కరిస్తాయి. యువభారతికి అత్యంత ఆప్తులు, ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారు మా పట్ల దయతో వ్రాసి ఇవ్వడానికి అంగీకరించిన "ఆంధ్ర కవి నక్షత్రమాల" పుస్తకాల వరుసలో మొట్టమొదటిది ఈ పుస్తకం. దురదృష్టవశాత్తూ ఆయన నిర్యాణంతో ఆ series ఇక ముందుకు కదలలేదు.

SCAN FOR E-BOOK

## 118. హనుమప్ప నాయకుడు




శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారి "హైందవ ధర్మ వీరులు" అనే గ్రంథంలో ఒక పతిహిత ఆంజనేయుడైన వీరుడు హనుమప్ప నాయకుని సాహస గాథ ఉన్నది. ఈ "హనుమప్ప నాయకుడు" కావ్యానికి అది మూలమైంది. హైదరాబాదు నిజాం ఆంధ్రదేశంలో నిలదొక్కుకుంటున్న కాలంలో గద్వాల ప్రభువులు స్వతంత్ర ప్రతిపత్తికోసం, ధర్మరక్షణ కోసం, తెలుగు సాహిత్యంకోసం, ఆదరాభిమానాలతో కృషిచేసిన చరితార్థులు. ఆ గద్వాల రాజుల్లో, సోమభూపాలుని కాలంలో జరిగిన గాథ – ఈ హనుమప్పనాయకుడి ఇతివృత్తం. ఈ కావ్యాన్ని అందమైన ఛందస్సులలో పొదిగి, చక్కని తెలుగు నుడికారంతో కైసేసి, ప్రబంధ కవితాపథంలో నడిపించి తమ కావ్యరచనా నైపుణ్యాన్ని ప్రదర్శించారు శ్రీ తిరుమల కృష్ణదేశికాచార్యులు గారు.

SCAN FOR E-BOOK

## 119. తెలుగు బాల సాహిత్యం




పిల్లలకోసం ప్రత్యేకించి, వాళ్ళ వయస్తారతమ్యాలను దృష్టిలో ఉంచుకుని, భాషా దృష్టితో, వైజ్ఞానిక దృష్టితో ప్రమాణాలను ఏర్పరచి సాహిత్య సృష్టి చేసే పద్ధతి నిన్నటి శతాబ్దంలోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. గడచిన ఆరేడు దశాబ్దాల నుండి, లేదా అంతకంటే కొంచెం ముందు నుండి తెలుగులో బాలసాహిత్య రచనను గూర్చి కొన్ని ఆసక్తికరమైన అంశాలను డా. వెలగా వెంకటప్పయ్య గారు ఈ చిన్న పుస్తకంలో వివరించారు.

## 120. కవి సమయములు




కవులు చేసికొన్న నియమములే లేక సంప్రదాయములే కవి సమయములు అనవచ్చు. ఐతే, పూర్వ లాక్షణికులు కవిసమయాల పట్టికలిచ్చారే గానీ, వాటి శాస్త్రీయ నేపథ్యాన్ని వివరించలేదు. కానీ, డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారు తమ ఈ సిద్ధాంత గ్రంథంలో ఎన్నో కవిసమయాలను విశ్లేషిస్తూ వాటిని శాస్త్రీయ దృష్టితో, సహేతుక దృష్టితో వివరించారు. అప్పటికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వెలువడిన సిద్ధాంత గ్రంథాలలో – “పరిమాణంలో చిన్నది, కాని గుణంలో వియన్నది” అని డా. సి నారాయణ రెడ్డిగారి కితాబును పొందిన గ్రంథం.

## 121. నవ్య సాహితీ లహరి




ఆధునికాంధ్ర సాహిత్య నందనవనంలో విరిసిన ప్రక్రియలు – నవల, వ్యాసం, నాటిక, కథానిక. ఈ నాలుగు ప్రక్రియల గురించి ఆంశికంగానో, అతి విపులంగానో పండితులకూ, పరిశోధకులకూ పనికి వచ్చే పద్ధతిలో చాలా సారస్వతం తెలుగులో ఇప్పటికే ఉన్నా, ఈ ప్రక్రియల గురించి సమగ్రమైన పరిజ్ఞానం అందించే ఉద్దేశ్యంతో, నవలను గురించి డా. మంజుశ్రీ, కథానికను గూర్చి డా. పోరంకి దక్షిణా మూర్తి, వ్యాసాన్ని గూర్చి ఆచార్య వేటూరి ఆనంద మూర్తి, నాటికను గూర్చి డా. ఇరివెంటి కృష్ణమూర్తి గార్ల ప్రసంగ వ్యాసాల సంకలనమే – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 122. తెలుగులో గేయ నాటికలు




సర్వకళాసమాహారంగా ఆదరణ పొందిన నాట్యకళ పలు పోకడలు పోయినా, పాశ్చాత్య భావ ప్రపంచంతో మనకు సంబంధం కలిగిన తరువాత అక్కడనుంచి కొన్ని కళారూపాలు మనకు సంక్రమించాయి. వాటిలో గేయనాటిక కూడా ఒకటి. శతాధికంగా లభ్యమైన తెలుగు గేయనాటికలను ఉదహరిస్తూ, వాటిలోని ఛందాల అందాలను, భావాల గభీరతలను, అవి వ్యంజిస్తున్న రమణీయార్థాలను సరళ సుందర భాషలో ఇమిడ్చి, తమ ఈ సిద్ధాంత వ్యాసం ద్వారా మనకు అందించారు – డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య గారు.

## 123. అక్షరాల ఆలోచనలు



'అక్షరాలు' కవులకూ, రచయితలకూ ప్రతీకలుగా భావిస్తే, వారి ఆలోచనలను సమీక్షించిన వ్యాసాలు ఈ పుస్తకంలోని రచనలు. అవి అక్షరాలా ఆలోచనలే. డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యం గారి కలం నుండి జాలువారిన ఈ సంపుటిలో విశ్వనాధ సత్యనారాయణ, శ్రీశ్రీ, వానమామలై వరదాచార్య, దాశరధి, కుందుర్తి, భరద్వాజ, సి నారాయణ రెడ్డి, ఉత్పల, బాపురెడ్డి గార్ల రచనల పరిశీలనం ఉంది. ఎన్నుకొన్న అంశం మీద పఠితకు ఒక సమగ్రమైన, సమన్వయాత్మకమైన అవగాహన కలిగించడమే ఈ వ్యాసాల ప్రయోజనం.

SCAN FOR E-BOOK

## 124. తెలుగు రుబాయీలు



పారశీ, ఉర్దూ కవితా ప్రక్రియల్లో రుబాయీ ప్రముఖమైనది. రూపంలో ఈ ఛందస్సు మన ఆటవెలదికి సరిజోడు. గతిలో ప్రత్యేకమైన నియమం లేదు. మాత్రా ఛందస్సులోని ఏ గతినైనా తీసుకొని రుబాయీ ని రాయవచ్చు. ఈ గ్రంధ రచయిత డా. తిరుమల శ్రీనివాసాచార్య, తమ రుబాయీలకు త్రిస్ర గతిని వాడుకున్నారు. రుబాయీ కి అనివార్య లక్షణమైన ఒకటి, రెండు, నాలుగు పాదాలకు ఉండవలసిన అంత్యప్రాస నియతి పాటించారు. మూడవ పాదంలో అంత్యప్రాస లేకపోవడం రుబాయీ విశేషం. చెప్పదలచుకున్న విషయాన్ని నాలుగు చిన్న చిన్న పాదాల్లో ఇమిడ్చడం – ఎంతో ఒడుపున్న చేతికి తప్ప సాధ్యం కాదు. డా. శ్రీనివాసాచార్య గారు ఈ ప్రక్రియను సునాయాసంగా రాసి చూపించారు.

SCAN FOR E-BOOK

## 125. ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం




యువభారతి, తన రజతోత్సవ సంవత్సరంలో, సమకాలీన సాహిత్యాన్ని సమదృష్టితో, సమగ్రదృష్టితో సమీక్షించి, దానిలోని ఉత్తమ విలువలను తెలుగు వారికి అందించడానికి "ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం" అన్న శీర్షికతో ఒక సాహితీ సదస్సును నిర్వహించింది.  ఆ సదస్సులో– తెలుగు సాహిత్యం, తెలుగు కవిత, నవల, కథానిక, పత్రికా రచన, ప్రసార కళలు, సాహిత్య విమర్శ, సాహిత్య పరిశోధన – ఈప్రక్రియల మీద ఆయా రంగాలలో నిష్ణాతులైన డా.నాయని కృష్ణకుమారి, డా.ముదిగొండ వీరభద్రయ్య, డా.కాత్యాయనీ విద్మహే, శ్రీ వాకాటి పాండు రంగారావు, డా. పురాణం సుబ్రహ్మణ్య శర్మ, డా. కోవెల సంపత్కుమారాచార్య, శ్రీ శాంతిస్వరూప్ గార్ల వ్యాసాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 126. శ్రీమద్రామాయణ కల్పవృక్షము శబరి పాత్ర – ఒక పరిశీలన



రామాయణ కావ్యంలో శబరి ఒక తత్త్వ బిందువు, భక్తి సింధువు. హైదరాబాదులోని కేంద్ర విశ్వవిద్యాలయంలో యం.ఫిల్ పట్టానికై శ్రీ గోళ్ళ కుమారస్వామి నాయుడు గారు సమర్పించిన ఈ సిద్ధాంత వ్యాసాన్ని చదివితే ఒక లఘు కావ్యం చదివిన అనుభవం కలుగుతుంది. ఒక పాత్రను గురించిన సమగ్ర పరిశీలనాన్ని సమీక్షించిన ఆహ్లాదం కలుగుతుంది. కొన్ని విలువైన అంశాలను సమన్వయాత్మకంగా సంవదించుకొన్న తృప్తి మిగులుతుంది.

SCAN FOR E-BOOK

## 127. యువత



యువభారతి రజతోత్సవ ప్రచురణగా వెలుగు చూసిన ఈ వ్యాస సంకలనం – యువతరం సమస్యలపై విభిన్న దృక్పథాల సమాలోచనం. యువభారతికి పది వసంతాలు నిండిన సందర్భంలో గత శతాబ్దపు ఏడవ దశకంలోని యువతరం సమస్యలపై విభిన్న దృక్పథాలు కలిగిన రచయితలతో వ్యాసాలు వ్రాయించి ప్రచురించాలని రూపొందించబడినా, కొన్ని అనివార్యమైన కారణాలవలన వీటి ప్రచురణ ఆలస్యమైంది. మళ్ళీ 1985 లో అంతర్జాతీయ యువజన వత్సరోత్సవాల సందర్భంగా 500 మంది ప్రతినిధులు పాల్గొన్న గోష్టి కార్యకమాల పిదప ప్రచురించాలనుకున్నా కుదరలేదు. 1991 లో ప్రచురించబడ్డ ఈ వ్యాసమంజరి, దీన్ని అన్నివిధాలా రూపుదిద్ది, దాని ఆవిష్కరణకంటే ముందే కన్నుమూసిన అమృతమూర్తి, యువభారతి మాజీ అధ్యక్షులు, కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తి గారి దివ్య స్మృతికి అంకితం చేయబడింది.

SCAN FOR E-BOOK

## 128. పరిశోధనా పద్ధతులు




ఎం.ఏ., ఐపోగానే ఎం. ఫిల్., లోనో, పిహెచ్.డి లోనో చేరి విశ్వ విద్యాలయాలలో పరిశోధన చేసే యువ పరిశోధకులకు పరిశోధనా పద్ధతుల గురించి పరిచయం చేసి, ఒక అవగాహనను కల్పించే రచనను రూపొందించాలనే యువభారతి సంకల్పానికి ఒక ప్రామాణిక గ్రంథంగా ప్రాణం పోశారు శ్రీ ఆర్వీ సుందరం గారు. ఐతే కేవలం పరిశోధనే గాక, ఏ పనినైనా ప్రణాళికాబద్ధంగా ఎలా చేయాలో తెలుసుకోవడానికి కూడా ఈ పుస్తకం పనికి వస్తుంది.

SCAN FOR E-BOOK

## 129. కిన్నెరసాని పాటలు




విశ్వనాధ సత్యనారాయణ గారి కిన్నెరసాని పాటలు ఆధునికాంధ్ర గేయ కవిత్వంలో జుంటితేనె ఊటలు. ఆ తీపీ ఆ ఊపూ అపురూపమైనవి. కానీ శ్రీమతి జి. ఎస్. లక్ష్మి గారు ఎన్నుకున్న తెన్ను కొత్తది. ఆ పాటల్లోని వాక్య ప్రయోగాల గురించి చేసిన పరిశోధనా గ్రంధమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 130. కలంతో కాలమ్




తెలుగు సాహితీ జగత్తులో లోతైన పరిశీలకుడిగా, ఎత్తైన సమీక్షకునిగా పేరెన్నిక గన్న ఆచార్య జి వి సుబ్రహ్మణ్యంగారు ఆంధ్రప్రభ దినపత్రికలో "కలం తో కాలమ్" అన్న శీర్షికతో దాదాపు ఒక సంవత్సరం పాటు రచించిన చిన్న చిన్న సాహితీ వ్యాసాల సమాహారమే ఈ పుస్తకం. ఈ వ్యాసాలు సమకాలీన సాహిత్య విశేషాలపై రన్నింగ్ కామెంటరీ వంటివి.

SCAN FOR E-BOOK

## 131. ఋతు సంహారము



భారత దేశంలో కనబడే ఆరు ఋతువుల వర్ణనలు ఒక్క చోట చేర్చి రచించిన చిన్న కావ్యం – కాళిదాసు రచించిన ఋతుసంహారం. ఆ కావ్యానికి శ్రీ తిరుమల కృష్ణ దేశికాచార్యులు గారు, తెలుగులో చక్కని స్వేచ్ఛానువాదం చేసారు. కవి కెనడాలో ఉంటున్నా, తన సంస్కృతినీ, సాహిత్యాన్నీ మరచిపోకుండా మననం చేసుకోవడమే కాక, ఎలక్ట్రానిక్ యంత్ర పరిజ్ఞానంతో తెలుగు భాషా లిపిని ముద్రాక్షర రూపంలో Macintosh కంప్యూటర్ పై - ఇప్పటికి నలభై ఏళ్ళ క్రితమే - మలిచిన ప్రయోగ శీలి. ఈ పుస్తకం అలా compose చేయబడినదే.

SCAN FOR E-BOOK

## 131–A. అమృతం కురిసిన రాత్రి వాక్య లయ : భావ పోషణ



దేవరకొండ బాల గంగాధర తిలక్ వ్రాసిన "అమృతం కురిసిన రాత్రి" ఆధునిక వచన కవితా ప్రస్థానంలో ఒక కొత్త మలుపును సూచించే మైలు రాయి. పద్య కవిత్వంలో శ్రీనాథుని రచన లాగా వచన కవిత్వంలో తిలక్ రచన, పఠితకు ఒక విధమైన సమ్మోహనాన్ని కలిగిస్తుంది. పఠిత పొందే ఈ అనుభూతిని తర్కబద్ధంగా విశ్లేషించి శాస్త్రీయంగా నిరూపించాలి అనే గాఢమైన కోరికతో, శ్రీమతి వై కామేశ్వరి గారు పరిశోధన చేసి సమర్పించి ఎం.ఫిల్ పట్టా పొందిన వ్యాసమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 132. ఇరివెంటి రచనలు



మంచితనానికి మరో పేరు – శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారు. తాను అనుదినం అభ్యసించి ఆర్జించిన అక్షర శక్తినీ, ఆలోచనా స్ఫూర్తినీ, సమాజ ప్రగతికి అర్పించిన విశాల హృదయుడు. ఆయన సాహితీ కృషి చేసిన నాలుగు ప్రక్రియలకూ ప్రతినిధులుగా - ఈ సంపుటిలో నాలుగు భాగాలున్నాయి. మొదటి భాగం ఇరివెంటి 'కవిత్వం', రెండవ భాగం 'పఠనీయం', మూడవ భాగం 'కధానికలు' నాల్గవ భాగం ఆయన 'సమాలోచనలు'. ఈ పుస్తకం యువభారతి రజతోత్సవాల సందర్భంగా వెలువరించబడింది.

SCAN FOR E-BOOK

## 133. భారతంలో ప్రేమ కధలు



ఈ పుస్తకం పేరు వినగానే మీకు ఒక రకమైన ఆశ్చర్యం, ఆసక్తి, ఆనందం కలుగుతాయి. మహాభారతం నీతి కథలకూ, వీరగాధలకు, తత్త్వబోధనలకూ, ధర్మ సూక్ష్మాలకూ ప్రసిద్ధి – ప్రేమకథలకు కూడా భారతంలో బలమైన స్థానం ఉందా అని అనుమానం రాక మానదు. ఐతే కథను చెప్పటంలో, అనుభూతిని ఆవిష్కరించటంలో శ్రీ ముక్తేవి లక్ష్మణరావు గారూ, డా. ముక్తేవి భారతి గారూ చూపిన్ శైలీ మాధుర్యం చవిగొన్న కొద్దీ ఆనందం.

SCAN FOR E-BOOK

## 134. ఆక్సిజన్




ఈ పుస్తకం స్పృహ తప్పిన సమాజానికి జీవశక్తి . రచయిత డాక్టర్ నాగినేని భాస్కర రావు గారు వృత్తి రీత్యా డాక్టర్ గా, ప్రవృత్తి రీత్యా కవిగా – సమాజానికి రెండు రకాలుగా చికిత్స చేస్తున్నారు. ఈ కవితా సంపుటి కూడా యువభారతి రజతోత్సవాల ప్రచురణ.

SCAN FOR E-BOOK

## 135. ఆధునిక సాహిత్య విమర్శ




ఆధునిక తెలుగు సాహితీ విమర్శ ఎన్నో కొత్త పుంతలు తొక్కింది. అన్ని రంగాల్లో లాగానే, ఈ రంగంపై కూడా పాశ్చాత్య ప్రభావం పడి, ఎన్నో కొత్త విమర్శ ధోరణులు ఏర్పడినాయి. వీటి కారణంగా, తెలుగు సాహిత్యాన్ని కొత్త దృక్పథంతో, కొత్త ప్రమాణాలతో, కొత్త పద్ధతులలో విమర్శించే అవకాశాలు కలిగాయి. ఈ విమర్శ ధోరణులలో ఒకటైన అభిరుచి విమర్శ గురించి, డాక్టర్ మోచర్ల నాగరాజు గారు ఈ గ్రంథంలో సమర్థవంతంగా నిరూపించినారు. సాహిత్య విమర్శపై ఇది ఒక మంచి గ్రంథం.

SCAN FOR E-BOOK

## 136. మాతృభాషగా గల విద్యార్థులకు ద్వితీయ భాషగా తెలుగు బోధన సమస్యల విశ్లేషణ




బహుభాషా సమాజమైన భారత దేశంలో భాషాబోధన శాస్త్రీయ రీతిలో జరగవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. మన దేశంలో కొన్ని దశాబ్దాలుగా ఇంగ్లీష్ ను ద్వితీయ భాషగా దేశమంతటా పాఠశాలల్లో బోధించడం జరుగుతోంది. ఇక ఉభయ తెలుగు రాష్ట్రాలలో తెలుగు ముఖ్యమైన ప్రాంతీయభాషగా వాడుతున్నచోట తెలుగును హిందీ లేక తక్కిన భాషలు మాతృభాషగా గల పిల్లలు పాఠశాలల్లో నేర్చుకోవలసిన అవసరం ఏర్పడింది. ఇలా హిందీ మాతృభాషగా గల విద్యార్థులకు ద్వితీయభాషగా తెలుగును బోధించడంలో ఉన్న పద్ధతులు, మెళకువలు, వాటి పరిష్కారాలు మొదలైన అంశాలపై శ్రీమతి వై.రెడ్డి శ్యామల గారు ఈ పుస్తకంలో కూలంకషంగా చర్చించారు.

SCAN FOR E-BOOK

## 137. గంగా తరంగాలు




పేరులోనే కొత్తదనం సంతరించుకున్న ఈ గేయకవితా తరంగాలు - డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులవారి అంతరంగ తరంగాలు. తరంగాలు ఆగవు. ఉవ్వెత్తున ఉప్పొంగి చక చకా ముందుకు సాగిపోతాయి. స్తబ్దత తరంగాల లక్షణం కాదు – చలనం లేదా గమనం తరంగానికి సహజ స్వభావం. తరంగాలలో వలెనే ఈ గేయాలలోనూ సంగీతం వినిపిస్తుంది. ప్రతి గేయం లయబద్ధంగా రాగయుక్తంగా తన్మయత్వంతో పాడుకోవడానికి అనువుగా వ్రాయబడింది. ప్రతి గేయమూ పల్లవితో ప్రారంభమై, మూడు నాలుగు చరణాలతో భాసిస్తుంది. మూడు విభాగాలుగా విభజింపబడ్డ ఈ గేయసంపుటిలో 108 గేయాలున్నాయి.

SCAN FOR E-BOOK

## 138. పాతికేళ్ళ పత్రికా రచన




నేటి మన సామాజిక, సాంస్కృతిక, సాహిత్య రంగాలపై పత్రికా రచనా ప్రభావం అనంతం. యువభారతి రజతోత్సవాలలో భాగంగా పాతికేళ్లలో పత్రికా రచనలో వచ్చిన పరిణామాలను గురించి చర్చించడానికి 'పాతికేళ్ళ పత్రికా రచన' అనే ఒక సదస్సును నిర్వహించింది. పత్రికా రంగంలో పేరొందిన ఎందఱో ప్రముఖులు ఈ కార్యక్రమంలో పాల్గొని ఎన్నో నిజాలను నిజాయితీతో చెప్పారు. ఈ సదస్సులోని ముఖ్య పత్రాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 139. అమృత రాజీవం




తీవ్రవాదుల క్రౌర్యానికి బలై పోయిన దేశ ప్రధానులలో శ్రీ రాజీవ్ గాంధీ ఒకరు. ఆయన ఒక సాధారణ వ్యక్తి కాదు, అందరూ అంగీకరించిన పరమాదరణీయమైన ఒక ప్రజాస్వామ్య వ్యవస్థకు ప్రతినిధి. ఆయన ఘోరమైన హత్య ఆనాటి హత్యారాజకీయాలకూ, అప్పుడు విలయతాండవం చేస్తున్న తీవ్రవాదానికీ పరాకాష్ట. ప్రపంచ దేశాలన్నీ ముక్త కంఠం తో ఆ దారుణాన్ని నిరసించాయి. ఆ క్రూర హత్యనూ, హత్యా రాజకీయాలనూ తీవ్రంగా ప్రతిఘటిస్తూ ప్రతిస్పందించిన ఇరవై ఐదు మంది కవుల అక్షర హృదయభావ సరస్తరంగాల సంపుటి — ఈ అమృత రాజీవం. ఇందలి కవితలన్నీ సహజ కవి శ్రీ ఎం. ఎస్ రెడ్డి (మల్లెమాల) గారి అధ్యక్షతలో యువభారతి ఏర్పాటు చేసిన సమాలోచనంలో కవులు గానం చేసినవే.

SCAN FOR E-BOOK

## 140. తెలుగు కవిత - లయాత్మకత




డాక్టర్ సి నారాయణరెడ్డి గారు తాళబద్ధమైన లయను తాను పలికిన కవితకు జీవచైతన్యంగా నిలుపగలిగిన స్రష్ట. పద్యంలో గానీ, గేయంలో గానీ, పాటలో గానీ, వచన కవితలో గానీ ఆయన కలంలో, గళంలో తాళాత్మక లయ సహజసుందరంగా, సహృదయరంజకంగా, అభినవ దర్శనీయంగా రాణించడం ఆయనదైన ఒక ప్రత్యేకత. తెలుగు కవిత – లయాత్మకత అన్నది నాలుగు ఉపన్యాసాల మూల శీర్షిక. కానీ లోతుగా చూస్తే అది నారాయణరెడ్డి గారి కవితాత్మ అన్వేషణ.

SCAN FOR E-BOOK

## 141. అనుభూతి




యువతకు సాహిత్యాన్ని, నవ్య ప్రయోగాలతో, నవనీతంలా అందించే ఈ యువభారతి ఉద్యమంలో పాలు పంచుకుంటూ, సంస్థను ఎన్నోరకాలుగా ప్రోత్సహిస్తున్న యువభారతీయులు కొందరు కలిసి ప్రచురించుకున్న కవితా సంకలనమే – ఈ అనుభూతి. అజంతా గుహలలో అపూర్వ చిత్రాలను చిత్రించిన వారిలో పరిణతులూ ఉన్నారు; సాధకులూ ఉన్నారు. అలాగే ఈ కవితా సంపుటిలో కూడా. ఏ భావాన్నైనా కవితలో చెప్పినప్పుడు అది కళానుభూతిని అందించగలిగితేనే కవిత కాగలదని యువభారతి విశ్వాసం. కళానుభూతి కోసం కలాలు పట్టిన గళాల బృందగీతమే – ఈ 'అనుభూతి'.

SCAN FOR E-BOOK

## 142. వెండి వెలుగులు




యువభారతి సంస్థ స్థాపించి 1991-92 నాటికి 25 సంవత్సరాలు నిండాయి. అన్నేళ్ళుగా ప్రాచీన, ఆధునిక సాహిత్యం గొప్పదనాన్ని, మాధుర్యాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చెయ్యాలని యువభారతి చేసిన కృషిని విహంగ వీక్షణ మాత్రంగా చూపిన రజతోత్సవ సంచిక – ఈ వెండి వెలుగులు. సిల్వర్ జూబిలీ కనక వెండి వెలుగులు అన్నారు గానీ, ఈ సంచికలో బంగారు కణిక ల్లాంటి ఎన్నో వ్యాసాలు ఉన్నాయి. యువభారతి త్రైమాసిక పత్రిక "నందిని" లో 'ప్రభావం' శీర్షికన ప్రచురించబడ్డ డాక్టర్ దాశరథి, డా. సి నారాయణ రెడ్డి, డా.దివాకర్ల వెంకటావధాని, శ్రీ వానమామలై వరదాచార్యులు, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, డా.రావూరు వెంకట సత్యనారాయణరావు, శ్రీ కుందుర్తి, శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవి వంటి దిగ్గంతుల వ్యాసాలతో పాటు, యువభారతి నిర్వహించిన అనేక లహరీ కార్యక్రమాలలో పాల్గొన్న, ఉపన్యసించిన ఎందఱో సాహితీ స్రష్టల చిత్రాలు కూడా పొందుపరచబడ్డాయి.

SCAN FOR E-BOOK

## 143. భావుక సీమ



భారతీయ పునరుజ్జీవన చైతన్య భూమికను ఆధారంగా చేసుకుని వికసించిన తెలుగు సాహిత్య పరిణామ దశలను వివేచనాత్మకంగా వివరించే వ్యాస సంపుటి – ఈ భావుక సీమ. ఆధునికాంధ్ర సాహిత్య దర్శనానికి కరదీపిక. దాదాపు ఆరు దశాబ్దాలకు పైగా కవితలను, విమర్శలను, పరిశోధనలను వెలువరించి ఆధునిక సాహిత్యాన్ని సుసంపన్నం, సుప్రసన్నం చేస్తున్న సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు, కవివరేణ్యులు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు గారి వ్యాస సంపుటి.

SCAN FOR E-BOOK

## 144. దీపాల చూపులు : ప్రస్తుతం అందుబాటులో లేదు

## 145. కొత్త గొంతుకలు సరికొత్త విలువలు



యువభారతి రజతోత్సవాల సందర్భంగా, అత్యంత ఆధునిక సాహిత్య చైతన్యాన్ని సృష్టిస్తున్న యువ రచయితలను, రచయిత్రులను, వారి రచనలనూ, వాటి విలువలనూ వివేచించే సాహిత్య సదస్సును నిర్వహించింది. ఆ సదస్సులో పాల్గొన్న సాహితీమూర్తులు అందించిన ఉపన్యాస వ్యాస మంజరి – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 146. విద్యా వైద్య శాస్త్ర కళా రంగాలు – మానవతా విలువలు



యువభారతి రజతోత్సవాల సందర్భంగా, నిర్వహించిన సదస్సులో శ్రీ పాతూరి ప్రసన్నం, శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు, శ్రీమతి అడివి సూర్య కుమారి, డా. కె వి కృష్ణ కుమారి, డా. సురవరం పుష్పలత, శ్రీ పి నాగరాజు, శ్రీ కె బి గోపాలం, డా.జి వి సుబ్రహ్మణ్యం గారలు విద్యా, వైద్యశాస్త్ర, కళా రంగాలలో మానవతా విలువల గురించి చేసిన ప్రసంగ వ్యాసాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 147. స్త్రీ వాద ధోరణులు సమకాలీన సాహిత్యం



యువభారతి రజతోత్సవాల సందర్భంగా, నిర్వహించిన సదస్సులో డా.రావి భారతి, డా.ఎన్ నిర్మలా దేవి, శ్రీమతి కె అరుణకుమారి, డా.లావణ్య సరస్వతి, డా.వై కామేశ్వరి, శ్రీ బి.భుజంగ రెడ్డి, డా.కాత్యాయనీ విద్మహే, శ్రీమతి వి రామలక్ష్మి (కె బి లక్ష్మి) గారలు స్త్రీ వాద ధోరణులు సమకాలీన సాహిత్యం అంశంపై చేసిన ప్రసంగ వ్యాసాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 148. వివేకానంద లహరి




చికాగో నగరంలో జరిగిన ప్రపంచ విశ్వమత మహాసభలో వివేకానంద స్వామి ఉపన్యసించిన చారిత్రాత్మక సన్నివేశానికీ, స్వామీజీ హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలను సందర్శించిన మరువలేని ఘట్టానికీ శతజయంతి జరుగుతున్న సందర్భంలో నిర్వహించిన లహరీ కార్యక్రమమే – వివేకానంద లహరి. పూజ్యపాదులు శ్రీ పరమార్థానంద స్వామీజీ గారు ప్రారంభించిన ఈ ఉపన్యాస పరంపరలో, ఆ మహనీయుని వ్యక్తిత్వపు వివిధ కోణాలను స్పృశిస్తూ డా.ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు, శ్రీ వాకాటి పాండురంగారావు గారు, కుమారి డా. కమలా జయరావు గారు, డా. ప్రొద్దుటూరి ఎల్లారెడ్డి గారు, చేసిన ప్రసంగాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 149. సాహితీ సమాలోచనం



దాదాపు మూడు దశాబ్దాల క్రితం, 1992 – 1993 సంవత్సరాలలో, ప్రతి నెలా మొదటి ఆదివారం నాడు నిర్వహించిన సాహిత్య సమీక్షా కార్యక్రమాల మణిహారమే – ఈ సాహితీ సమాలోచనం. ఆచార్య ఎన్ గోపి, డా. సి మృణాలిని, శ్రీమతి అడివి సూర్యకుమారి, డా.బి జయరాములు, ఆచార్య నాయని కృష్ణకుమారి, డా.కసిరెడ్డి వెంకటరెడ్డి, డా.ముదిగొండ వీరభద్రయ్య గార్ల వ్యాసాలతో పాటు, డా.ద్వా.నా. శాస్త్రిగారు, డా.కడియాల రామమోహన్ రాయ్ వంటి దిగ్గజాలు తెలుగు సాహితీ చరిత్రలో ఆ రెండేళ్లలో వచ్చిన మార్పులను సమీక్షించిన వ్యాసాలూ ఉన్నాయి.

SCAN FOR E-BOOK

## 150. తెలుగు తమిళ కవితలు - జాతీయవాదం



జాతీయ భావం ఆధునికమని వ్యవహృత మౌతున్నా, అది మనదేశంలో ప్రాచీన కాలం నుండి ఏదో ఒప రూపంలో ఉండేది. ఈ సమైక్య భావాన్ని జాతీయ సాహిత్యం ఇనుమడిమ్పజేసింది. అప్పుడప్పుడు మతం, భాష మొదలైన వాటిని అడ్డుపెట్టుకుని వేర్పాటు భావాలు తలెత్తినా, జాతీయ భావం ముందు అవి పరాస్తములైనాయి. తెలుగు తమిళ సాహిత్యావగాహనలో పూల వంతెనలా, సాంస్కృతిక రాయబారిగా కృషి చేస్తున్న సహృదయ సాహితీ వేత్త డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ గారు, తోబుట్టువులైన తెలుగు తమిళ భాషలలో ఈ విశిష్టమైన జాతీయవాదం ఎలా పరిణతి చెందిందో చాలా చక్కగా వివరించిన పుస్తకం.

SCAN FOR E-BOOK

## 151. ఆధునిక సాహిత్యం, దళిత స్పృహ




నేటి తెలుగు సాహిత్యంలో అత్యంత నవ్య భావధోరణులుగా వెలువడుతున్న స్త్రీవాదం, దళితవాదం, సాహితీపరుల, రచయితల దృష్టిని బాగా ఆకర్షిస్తున్నాయి. పత్రికలలో ఆ ప్రవృత్తులమీద వ్యాసాలూ విరివిగా వెలువడుతున్నాయి. ఆ అంశాలపై సరళంగా సహృదయ లోకానికి పరిచయం చేయాలని యువభారతి తన సమాలోచన కార్యక్రమంలో భాగంగా ఒక గోష్టిని నిర్వహించింది. దానిలో పాల్గొన్న ప్రముఖులు శ్రీ కె.శ్రీనివాస్, డా. ఎస్వీ సత్యనారాయణ, ఆచార్య కె కె రంగనాథాచార్యులు, ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం గార్ల ప్రసంగ వ్యాసాల సంపుటి – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 152. త్యాగరాయ కృతులు




త్యాగరాజ స్వామి కృతులు శుద్ధ సంగీత ప్రక్రియ, లేదా సంగీత ప్రధాన ప్రక్రియలకు చెందినవి. ధాతు కల్పనా దక్షుడైన త్యాగరాజును వాగ్గేయకారులలో అగ్రగణ్యునిగా నిరూపింపబడిన ఈ పుస్తకంలో "త్యాగరాజు కృతులన్నీ రాగసౌందర్యానికి సంకేతాలే, కనుక అవన్నీ భక్తిభావ పోషకములే. భక్తిభావానుకూలముగా స్వర లయలను ప్రయోగించడంలో త్యాగరాజు విశిష్టత సాధించారు. ఆయన శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య మధుర భక్తులకు చెందిన కృతులను రచించినా, శాంత దాస్య భక్తికి చెందిన కృతులను అధిక సంఖ్య లో రచించారు. వీటన్నింటిలోనూ స్వరలయయే రస పోషణకు మూలం" అని శ్రీమతి ఉషాలక్ష్మి గారు ప్రతిపాదించి, సోదాహరణంగా వివరించారు.

SCAN FOR E-BOOK

## 153. ప్రశ్నార్ధకాలు




యువభారతి ప్రచురణగా తమ తొలికావ్యమైన “వేగు చుక్కలు” ను ప్రచురించిన ప్రముఖ కవి శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడ్ ‘సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీమ్’ క్రింద ఈ రెండవ కావ్యం “ప్రశ్నార్ధకాలు” అనే కవితా సంపుటిని ప్రచురించారు. యువభారతిలో కార్యకర్త లే కాదు – కావ్యకర్తలు కూడా ఉన్నారనడానికి వీరు చక్కని నిదర్శనం. కవిత్వంలో అస్పష్టత, అనన్వయం లేని కావ్యం – ఈ ప్రశ్నార్ధకాలు.

SCAN FOR E-BOOK

## 154. మహాశిల్పి జక్కన చరితము




డాక్టర్ తిరుమల కృష్ణదేశికా చార్యులు కెనడాలో స్థిరపడ్డారు. కంప్యూటర్ల మధ్య నడయాడుతున్నా ఆయన కావ్య తత్వాన్ని మననం చేసుకుంటూనే ఉంటారు. యంత్రాలు వారికి మంత్రాలను నేర్పాయి. ప్రయోగాలను చేయడానికి ప్రేరేపించాయి. ఇరవయ్యో శతాబ్దంలో కూడా పద్య కావ్య ప్రబంధ స్పృహను బలంగా పోషిస్తున్న ప్రవాసాంధ్ర ప్రసిద్ధ కవి డాక్టర్ తిరుమల కృష్ణ దేశికాచార్యులు గారు. ఈయన రచించిన హనుమప్ప నాయకుడు, ఋతు సంహారం పద్యకావ్యాల తరువాత, యువభారతి ఈ ఉదాత్తమైన మహాశిల్పి జక్కన చరితమును ముచ్చటగా మూడవ కావ్యంగా ప్రచురించింది.

SCAN FOR E-BOOK

## 155. పాల సముద్రం




తెలుపు స్వచ్ఛతకు ప్రతీక. పాల సముద్రం స్వచ్ఛమైన సేవానిరతితో కూడిన డాక్టర్ల జీవితాలకు, వైద్య రంగానికి ప్రతీక. అలాగే పాల సముద్రంలో హాలాహలం కూడా ఉంటుంది. తెల్ల కోట్లు తగిలించుకున్నంత మాత్రాన, మనసులు తెల్లగా ఉంటాయనుకోవడం కూడా పొరపాటే. అలా వైద్య వృత్తిలో గల చీకటి వెలుగులను చక్కని, చిక్కని కధనంగా గ్రంధస్తం చేశారు — షేక్ ఆరిఫ్ (బాబు).

SCAN FOR E-BOOK

## 156. శ్రీకృష్ణుడు జ్ఞాన సారధి




ఆధునిక జీవిత సంఘర్షణలో నలిగిపోతూ విషాదయోగాన్ని భజిస్తున్న సామాన్య మానవునికి సులభంగా, సరళంగా, కథా మధురంగా, ఉదాహరణ సహితంగా, ఆసక్తి కరంగా, ఆలోచనలు రేకెత్తించే విధంగా, వివేచనాపరంగా సాగిన వివిదాంశాలమీద వ్యాఖ్యలను ఇందులో పొందుపరిచారు — శ్రీమతి అడివి సూర్యకుమారిగారు. నిత్యజీవితంలో పనికివచ్చే గీతలోని ఆణిముత్యాల నన్నింటినీ గుదికూర్చి కట్టిన ముత్యాలహారం — ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 157. రావిశాస్త్రి గారి ధర్మేతిహాసం




సామాజిక సిద్ధాంతాలు, సాహిత్య, కళా, తత్త్వ సిద్ధాంతాలు, విమర్శక మౌలిక సూత్రాలు మొదలైన అరుదైన విమర్శ రంగాలలో, ప్రామాణిక ప్రస్థానాలను సాగిస్తున్న ప్రజ్ఞామూర్తి డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య గారు. ఆధునిక రచయితలలో రాచకొండ విశ్వనాథ శాస్త్రి (రావి శాస్త్రి) గారిది సమున్నత స్థానం. వారి మూడు కథల బంగారం నవలపై ప్రామాణిక విమర్శ పద్ధతిలో సమీక్ష సాగించి, దానిని రావిశాస్త్రి గారి ధర్మేతిహాసంగా వ్యాఖ్యానించడం ఆయన రచనలోని ప్రత్యేకత. ఒక విశిష్ట రచన మీద ఒక విశిష్ట విమర్శ – ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 158. కొలమానం




యువభారతి సాహితీ ప్రస్థానంతో ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం గారికి పాతికేళ్ళ పైనుండే పరిచయముంది. విమర్శనావ్యాసాలతో పాటు పత్రికలలో కాలమ్ రచనలను కూడా ఆచార్య సుబ్రహ్మణ్యం గారు సమర్ధవంతంగా నిర్వహించి, సాహితీ లోకం నుండి ప్రశంసలను అందుకున్నారు. ఉదయం లో 'సాహితీ స్పర్శ' ఆంధ్ర భూమిలో 'జీవియస్ కాలమ్' లను, మరికొన్ని సాహిత్య వ్యాసాలను కలిపి 'కొలమానం' గా యువభారతి ప్రచురించింది.

SCAN FOR E-BOOK

## 159. విశ్వనాథ నవ్య సంప్రదాయం




'కవిసామ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు తిరుపతి వేంకట కవుల ఆశుకవిత్వ అవధాన కవిత్వోద్యమంలో గళమెత్తారు. కాల్పనికోద్యమంలో తమదైన ఒక శాఖను పండించుకొన్నారు. ప్రబోధ కవిత్వంలో తమ ప్రత్యేకతను ప్రకటించుకున్నారు. నవ్య సంప్రదాయోద్యమానికి తామే నాయకులై దాదాపు నాలుగు దశాబ్దాలు యుగకర్తగా తెలుగు సాహిత్యాన్నంతా ఆవరించారు. ఈ పుస్తకం – విశ్వనాథ వారి నాయకత్వంలో సాగిన నవ్య సంప్రదాయ ఉద్యమాన్ని గురించి వివరించే ఒక పరిచయాత్మకమైన గ్రంథం.

SCAN FOR E-BOOK

## 160. విశ్వనాథ సాహితీ సమాలోచనం




'కవిసామ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ గారి శతజయంత్యుత్స వాలను 1994 సెప్టెంబరు నెలలో ప్రారంభించి, ప్రతి నెలా మొదటి ఆదివారం సాయంకాలం 'సమాలోచనం' కార్యక్రమంలో భాగంగా, విశ్వనాథ సాహితీ సమాలోచనాన్ని పన్నెండు నెలలపాటు నిర్విఘ్నంగా నిర్వహించింది. ఈ కార్యక్రమంలో శ్రీ విశ్వనాథ పావని శాస్త్రి, డా. కోవెల సంపత్కుమారాచార్య, డా. కోవెల సుప్రసన్నాచార్య, డా. ముదిగొండ వీరభద్రయ్య, శ్రీమతి కె బి లక్ష్మి, డా. ముక్తేవి భారతి, డా. నాయని కృష్ణకుమారి,శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, శ్రీ వాకాటి పాండురంగారావు, శ్రీ పేరాల భారత శర్మ, శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య, డా. వి.వి.ఎల్. నరసింహారావు, శ్రీ పాతూరి నాగరాజు, శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి, డా. నాయని కృష్ణకుమారి, డా. యన్ నిర్మలాదేవి, డా. వై. కామేశ్వరి, శ్రీ కోయి కోటేశ్వరరావు, డా. మసన చెన్నప్ప, వంటి లబ్ద ప్రతిష్టుల 34 వ్యాసాలు, 15 కవితా నీరాజనాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 161. ప్రస్తుతం అందుబాటులో లేదు.

## 162. స్వాతంత్ర్య స్వర్ణ భారతి



స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా కవితా రంగంలో కృషి చేస్తున్న 50 మంది యువ కవులను కవయిత్రులను ప్రోత్సహించి సన్మానించే ఉద్దేశ్యంతో, ఆంధ్రప్రదేశ్ యువజన సేవాశాఖ, రాష్ట్ర స్థాయిలో ఒక యువకవి సమ్మేళనం ఏర్పాటు చేసి, ఒక కవితా సంపుటిని ప్రచురించే గురుతర బాధ్యతను యువభారతి భుజస్కంధాలపై ఉంచింది. సంస్థ వెలువరించిన పత్రికాప్రకటనకు స్పందించి, కవులు పంపిన వందకు పైగా కవితలలో, యాభై కవితలను ఎన్నుకుని, కవి సమ్మేళనాన్ని నిర్వహించి, వారి కవితలను ఈ ప్రచురణ ద్వారా వెలువరించాము.

SCAN FOR E-BOOK

## 163. దివాకర్ల వేంకటావధాని జీవితం సాహిత్యం



ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి జీవితం మీదా, సాహిత్యం మీదా డాక్టర్ గోళ్ళ కుమార స్వామి నాయుడు గారు చేసిన పిహెచ్. డి పరిశోధనా గ్రంధమే ఈ పుస్తకం. ఈ సిద్ధాంత వ్యాసాన్ని చదివితే దివాకర్ల వారి వాంగ్మయ మూర్తి ప్రసన్న మధురంగా మన మనస్సులో ప్రతిఫలిస్తుంది. ఐదు ప్రకరణాలలో చిత్రింపబడిన దివాకర్ల వారి సాహితీ వ్యక్తిత్వం సరళంగానూ, సమగ్రంగానూ ఆయన స్వభావాన్ని ప్రదర్శిస్తోంది. ఈ పుస్తకం అక్షర పుష్పాలతో నాయుడుగారు చేసిన గురుపూజ.!!

SCAN FOR E-BOOK

## 164. వ్యక్తిత్వ వికాసము - ఆరోగ్య సూత్రాలు




ఆరోగ్యమే మహాభాగ్యం అంటూ మనం ఎన్నోసార్లు విన్నా, ఆరోగ్యం ఉన్నంతవరకూ ఆ మహాభాగ్యం విలువ మనకు గుర్తుకు రాదు. వ్యక్తిత్వ వికాసానికీ, ఆరోగ్య పరిరక్షణకూ ఎంతో సన్నిహిత సంబంధం ఉందని మనకు మరోమారు గుర్తుచేద్దామని యువభారతీయుడు, డా. నాగినేని భాస్కరరావు చేసిన ప్రయత్నమే ఈ పుస్తకం. తాను వైద్యుడిగా నేర్చుకున్నది వీలున్నంత ఎక్కువమందికి తెలిపి, వారు తమ తమ ఆరోగ్యాలను సంరక్షించుకునేలా చేద్దామనే రచయిత సత్సంకల్పం ఈ పుస్తకంలో కనిపిస్తుంది.

SCAN FOR E-BOOK

## 165. గోరంత దీపం కొండంత వెలుగు




మంచి పుస్తకాలలోని మంచి ఆలోచనలు, మన మెదడుకు మంచి పోషకాహారం అన్నారు. ఆ ఆలోచనలను అర్థం చేసుకుని, స్వంతం చేసుకుని, ఆ ప్రభావాన్ని మనసారా ఆహ్వానించి, మంచి పునాదులపై మంచి జీవితాలను నిర్మించుకోవచ్చు. కొందరు మహామహుల జీవితాల్లో కొన్ని ముఖ్యమైన సంఘటనలు, వాటికి వాళ్ళు ప్రతిస్పందించిన తీరు – తేలిక మాటల్లో చక్కగా వివరిస్తూ, చదువరికి ఉత్తేజాన్ని కలిగించే విధంగా చెప్పారు, బాల సాహిత్య రచనకే జీవితాన్ని అంకితం చేసిన శ్రీ రెడ్డి రాఘవయ్య గారి ఈ చిన్న పుస్తకంలో.

SCAN FOR E-BOOK

## 166. హాస్య లహరి




ప్రాచీన ఆంధ్ర సాహిత్యంలోని హాస్యరస విశేషాలతో పాటు, ఆధునిక సాహిత్య సృష్టికర్తలు, ప్రముఖ రచయితలు – కందుకూరి, చిలకమర్తి, పానుగంటి, గురజాడ, మొక్కపాటి, భమిడిపాటి, మునిమాణిక్యం, ముళ్ళపూడి, భానుమతీ రామకృష్ణ ల రచనలలోని హాస్య విశేషాలను గురించి ఆచార్య ఎస్వీ రామారావు, డా. అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ), డా.ముక్తేవి భారతి, డా.వెలుదండ నిత్యానంద రావు, శ్రీ శంకరనారాయణ, శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మ, శ్రీ నండూరి పార్థసారథి, శ్రీ సుధామ, డా.శారదా అశోకవర్ధన్, శ్రీ శ్రీరమణ గార్ల ఉపన్యాస వ్యాసాల సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 167. నవజీవనం




డా.నాగినేని భాస్కర రావు గారు, ఈనాడు మానవుని నవజీవనానికి అనివార్యంగా అవసరమైనది ఏమిటో, పర్యావరణం అంటే ఏమిటో, జలకాలుష్యం ఎలా జరుగుతున్నదో, ఆ కాలుష్యం వల్ల వ్యాపించే వ్యాధులు ఎలాంటివో, జలకాలుష్య నివారణకు తీసుకోవాల్సిన జాగ్రత్తలు ఎలాంటివో, ఒక్కముక్కలో చెప్పాలంటే దినం దినం కలుషితమైపోతున్న పర్యావరణాన్ని ఎలా పరిరక్షించుకోవాలో ఈ రూపకం – ఈ 'నవజీవనం' – ద్వారా వివరించారు. ఈ రూపకం తో పాటు సారాయి వల్ల శరీరానికి కలగే విధ్వంసం గురించి "మనకొద్దు సారా" అన్న వ్యాసం కూడా పొందుపరచ బడింది.

SCAN FOR E-BOOK

## 168. ఆలోచనం




యువభారతి మహోజ్జ్వలంగా ఉద్యమించి తెలుగు సాహిత్య సేవ చేసిన కాలంలో 'నందిని' అనే పత్రికను నడిపింది. ఆ పత్రికలో 'ఆలోచనం' అన్న శీర్షికతో అనేక విషయాలను గూర్చి సంక్షిప్తంగా చక్కని వ్యాసాలను ధారావాహికంగా వ్రాశారు. – ఆచార్య జి వి సుబ్రహ్మణ్యంగారు. అలా ఆయన రచించిన ముప్ఫై ఎనిమిది వ్యాసాల సంపుటి ఈ ఆలోచనం. సంగీతం, సాహిత్యం, శాస్త్రం, కవిత్వం, కళలు, భక్తి, రక్తి ముక్తి, అభినయం, విద్య, విశ్వవిద్యాలయాలు, పరిశోధనం, ప్రణయం, పగ వంటి అంశాలపై వస్తు వైవిధ్యమున్న వ్యాసాలు ఈ సంపుటిలో చోటు చేసుకున్నాయి. సూక్తిమంతంగా ఉన్న కొందరు మహాకవుల మౌలికమైన ఆలోచనలకు, చక్కని సాహితీ పరిమళ వ్యాఖ్యలు ఇందులో దర్శనమిస్తాయి.

SCAN FOR E-BOOK

## 169. అక్షతలు




యువభారతి తొలిరోజుల్లో సభ్యులందరితో భుజం కలిపి కలిసి పనిచేయడమే కాక, సంస్థకు ఉపాధ్యక్షులుగా కూడా సాహితీ సేవలనందించిన శ్రీ అయ్యదేవర పురుషోత్తమ రావు గారు, మంచి నటులు, మధుర గాయకులు, గాన సంగీత రంగకృతస్వాంతులు, నాటకాలలో శ్రీకృష్ణ పాత్రధారిగా అత్యుత్తమ నటనను ప్రదర్శించిన 'నటసారథి' బిరుదాంకితులు. అప్పుడప్పుడు రేడియోలో, వివిధ పత్రికలలో సంకలనాలలో రాసి చదివిన కవితలన్నిటినీ మాలగా గుచ్చి ప్రచురించబడిన ఈ కవితా సంపుటి ద్వారా శ్రీ పురుషోత్తమ రావుగారు కవి భూమికలో అవతరించారు.

SCAN FOR E-BOOK

## 170. అనంత గీత




ఆరాధ్యనీయమైన భగవద్గీత ఎన్నో 'గీత' లకి ప్రేరణనిచ్చింది. ఇస్తూ ఉంటుంది. మన గీత మారాలనుకుంటే, గీత నాశ్రయించడం కన్నా మిన్నయైన మార్గం ఉంటుందా ? 50 ఏళ్ళకు పైగా సాహిత్యంతో సహవాసం ఉన్న శ్రీ మాడభూషి అనంతాచార్యులుగారు రచించిన ఈ 'అనంత గీత' లో చదివించే గుణం ఉంది. ముందుకు నడిపించే గుణం ఉంది. ఏదైనా 'పారాయణం చేస్తే పుణ్యం వస్తుంది' అనే భావనతో కాకుండా 'ఆచరించడమే తరించడానికి మార్గం' అనుకున్నప్పుడు ఎక్కువ ఫలితం దక్కుతుంది.

SCAN FOR E-BOOK

## 171. సాహిత్యం ఎందుకు చదువాలి ?




నేటి యువత ఈ ప్రశ్నను వేస్తున్నది, వేసుకుంటున్నది. సాహిత్యం చదివితే నేడు ఉద్యోగాలు రావు. భాషాభిమానం కూడు పెట్టదు. డబ్బు ముఖ్యం. భాషెందుకు ? భాష కావాలనుకున్నా, సాహిత్యం ఎందుకు చదవాలి? ఎవరో ఒకరు పూనుకుని ఇలాంటి ప్రశ్నలకు సమాధానం చెప్పకపోతే, లేదా సరైన సమాధానం చెప్పడానికి ఇంకా ఆలస్యం చేస్తే, రాబోయే తరాల వారు 'సాహిత్యం చదువనక్కరలేదు' అనే అభిప్రాయానికి వచ్చే ప్రమాదముంది. చక్కని వ్యక్తిత్వ నిర్మాణానికి ఉత్తమ సాహిత్య పఠనమే ప్రథమ సోపానం అనే భావం అందరి మనసుల లోనూ బలంగా నాటుకోవడం కోసం, ఒక చిన్న ప్రశ్నకు సుదీర్ఘ సమాధానం ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 172. చేగొండి కథా కదంబం




శ్రీ చేగొండి రామజోగయ్య ఈ కథా కదంబంలో, ఆయన కలం నుండి వెలువడ్డ 13 కథలు, ఒక స్కెచ్ ఉన్నాయి. రచన రచయితలకు ఔట్ లెట్. రచయితలు తమ భావాల్ని ఇతరులతో పంచుకోవడానికి, తమను తాము వెతుక్కోవడానికి, పాఠకులకు ఆహ్లాదకరమైన వినోదాన్నిఅందించడానికీ ఇలా అనేక కారణాలతో రచనలు చేస్తారు. ఒక్క వాక్యంలో చెప్పాలంటే – 'సరదాగా సాగే కొంటె కథలు' ఈ చేగొండి కథా కదంబం.

SCAN FOR E-BOOK

## 173. ఇరివెంటి బాల సాహిత్యం




బాలలు సున్నిత హృదయులు. వారి ఉజ్జ్వల భవిష్యత్తు కోసం, చిన్నతనం లోనే, సద్భావ బీజాలను నాటాలి, వారిని ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దాలి. అందుకోసం వారికి అర్థమయ్యే రీతిలో మంచి రచనలు చేయాలి. ఇరివెంటి వారు ఆ మార్గంలో కొంత ప్రయత్నం చేశారు. బాలలను "దేశమును ప్రేమించుమన్నా" అంటూ వారికి మహనీయుల "అడుగుజాడల"లో నడవమనీ, అందుకు తగిన "వెలుగుబాటలు" చూపిస్తూ, "వేగుచుక్కలు"గా పేర్కొనదగిన వారిని ప్రశంశిస్తూ "వెలుగు చూపే తెలుగు పద్యాల"ను వివరణాత్మకంగా వెలువరించారు. ఇంతకూ ముందు వారు వ్రాసిన వ్యాసాలను అన్నింటినీ కలిపి, ఇరివెంటి బాల సాహిత్యంగా వారి 78 వ జయంతి సందర్భంగా ప్రచురించాం.

SCAN FOR E-BOOK

## 174. శ్రీ కృష్ణ దేవరాయలు



ఆంధ్ర భోజుడు, అష్టదిగ్గజ కవిమండలి వాగ్విలాస లాసితుడు ఐన శ్రీ కృష్ణ దేవరాయలు ఆంధ్రులకు ప్రాతఃస్మరణీయుడు. ఆయన కాలం ఆంధ్రుల ప్రాభావానికీ, ఆంధ్ర సంస్కృతికీ స్వర్ణయుగం లాంటిది. మహమ్మదీయ విజ్రుంభణాన్ని అరికట్టి దక్షిణాపథం లో హిందూ మతాన్ని పునరుద్ధరించడం ధ్యేయంగా స్థాపించబడ్డ విజయనగర మహా సామ్రాజ్యానికి నిజమైన వారసుడాయన. సాహితీ సమరాంగణ సార్వభౌముడిగా దిగంతవిశ్రాంత యశస్సాంద్రుడైన ఆ రాజ దేవేంద్రుని వైభవాన్ని, ఆయన జీవితంలోని అనేక చారిత్రక కోణాలను స్పృశిస్తూ శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారు రచించిన చారిత్రక నవల.

SCAN FOR E-BOOK

## 175. మరో జంఘాల శాస్త్రి



పానుగంటి లక్ష్మీనరసింహా రావు గారు తెలుగు సాహిత్య ప్రపంచానికి అందించిన అద్భుత కానుక 'సాక్షి' వ్యాస కదంబం. వారు కల్పించిన 'జంఘాల శాస్త్రి' ఒక వైఖరికి ప్రతీక. ఒక ఆలోచనాసరళికి సూచిక. పరిహాస భావ పేటిక. యువభారతి విశ్రాంత కార్యదర్శి శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారు 'మరో జంఘాల శాస్త్రి' పేరున, పానుగంటివారి అడుగుజాడల్లో కొన్ని వ్యాసాలు వ్రాయగా యువభారతి ప్రచురించింది. అశేష పాఠకులు ఎంతో సంబరంతో ప్రతులన్నీ సొంతం చేసుకోగా, వారు వ్రాసిన మరికొన్ని వ్యాసాల సంకలనమే ఈ మరోజంఘాల శాస్త్రి.

SCAN FOR E-BOOK

## 176. వేద విజ్ఞాన లహరి



వేదం అంటే జ్ఞానం. ఇది జీవన నియతికి ప్రమాణం. అపౌరుషేయాలైన ఈ వేదాలు స్వర ప్రధానమైనవి. స్వరాలు ఒకరు చెబితేనే తెలుస్తాయి కాని చదివితే తెలియవు. అందుకే గురుముఖతః నేర్చుకోవాలి. వేదాలు బ్రహ్మతత్వాన్ని తెలియజేయడంతో పాటు మానవునికి ఆనందం, విజ్ఞానం, భద్రత, శాంతి సౌభాగ్యాలను కలిగిస్తాయి. వేదాలలో అనేక సామాజిక సూత్రాలు, విజ్ఞాన విశేషాలు ఉన్నాయి. కాలానుగుణంగా వెల్లువలో కొట్టుకుపోవడం కాక, సమాజాన్నీ, మానవీయతనూ నిలబెట్టడం కోసమే సాహిత్యం అనీ, విశ్వశ్రేయస్సు లక్ష్యమైన సాహిత్యం నిజమైన ఆలోచనామృతం అనే ప్రగాఢ విశ్వాసంతో యువభారతి "వేదవిజ్ఞాన లహరి" కార్యక్రమాన్ని నిర్వహించింది. ఈ సమావేశాలలో ఋగ్వేదంలోని విశేషాంశాల గురించి డా.విష్ణుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, యజుర్వేదం లోని విశేషాంశాల గురించి డా.చిర్రావూరి శివరామకృష్ణ శర్మగారు, సామవేద ప్రాశస్త్యం గురించి డా.రేమెళ్ల అవధానులు గారు అధర్వవేద ప్రాశస్త్యం గురించి డా.రాళ్ళబండి కవితా ప్రసాద్ గారు ప్రసంగించి వ్యాసాలను అందించారు. వేద సాహిత్యాన్ని సంక్షిప్తంగా పరిచయం చేసే డా.కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు గారి వ్యాసంకూడా ఈ పుస్తకంలో చేర్చబడింది.

SCAN FOR E-BOOK

## 177. విజయానికి అభయం



హనుమంతునిలోని విశిష్ట లక్షణాలు – బుద్ధి, బలం, యశస్సు, ధైర్యం, నిర్భయత్వం, ఆరోగ్యం, వాక్పటుత్వం మొదలైనవి. ఈ గ్రంధకర్త, శ్రీ గంధం నారాయణ గారు ఇందులో ఒక్కొక్క అంశాన్ని తీసుకుని, ఆసక్తిదాయకంగా విశ్లేషిస్తూ, రామాయణం లోని హనుమ పాత్రనూ, వివిధ సన్నివేశాలలో హనుమ వ్యవహార సరళినీ మన ముందుంచుతూ, వ్యక్తిత్వ వికాసానికి వాటిలోనుండి మనం గ్రహించవలసిన ఉదాత్త గుణసంపద గురించి గుర్తింపజేశారు. అభయాంజనేయ స్వామి వారినుండి స్ఫూర్తిని పొంది ఉన్నత శిఖరాలనందు కోవాలనే యువతీ యువకులకు ఈ గ్రంధం అవశ్యం పఠనీయం.

SCAN FOR E-BOOK

## 178. ఉపనిషత్ సుధా లహరి



ఉపనిషత్తు అంటే సమీపంలో కూర్చుని గురు ముఖతః అభ్యసించేది అని అర్థం. ఆధునిక శాస్త్ర విజ్ఞానం ప్రపంచం యొక్క స్వరూప స్వభావాలనూ, శక్తి యుక్తులనూ ఆవిష్కరించేదయితే, ఈ పనిచేసే వ్యక్తుల స్వరూప స్వభావాలనూ, శక్తి యుక్తులనూ గురించి పరిశోధించేదీ, ఆవిష్కృతం చేయించేదీ – 'ఉపనిషద్విజ్ఞానం'. సమాజంలో శాంతియుత సహజీవనానికీ, సకల మానవాభ్యుదయానికీ దోహదం చేసే ఆ విజ్ఞానమే – ఉపనిషత్తులు. లభ్యమౌతున్న 188 ఉపనిషత్తుల్లోనూ సమ్యక్ దృష్టి ప్రధానంగా దశోపనిషత్తులు సమగ్ర సమాహార సంపదగా భావింపబడుతున్నాయి. ఈ ఉపనిషత్ సుధా లహరి - ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు, డా.రేమెళ్ల అవధానులు, డా.దోర్బల ప్రభాకర శర్మ, డా.కె కోదండ రామాచార్యులు, ఆచార్య పి.శశిరేఖ, వాడ్రేవు చినవీరభద్రుడు, డా.రాళ్ళబండి కవితా ప్రసాద్, ఆచార్య కుప్పా శివసుబ్రహ్మణ్య అవధాని, డా.రాణి సదాశివమూర్తి, డా.చిర్రావూరి శ్రీరామ శర్మ, ఆచార్య మానస చెన్నప్ప, డా. చిర్రావూరి శివరామకృష్ణ శర్మ గార్ల - ఉపన్యాసాల సంకలనం.

SCAN FOR E-BOOK

## 179. వ్యక్తిత్వ వికాసం




పృథివ్యాం త్రీణి రత్నాని – జలమన్నం సుభాషితం". ఈ లోకంలో మూడే మూడు రత్నాలు – జలం, అన్నం, సుభాషితం అని ఒక సూక్తి ఉంది. జలమూ, అన్నమూ శరీరాన్ని పోషిస్తే, హృదయాన్ని వికసింప జేసేది సుభాషితం. గత పన్నెండేళ్ళుగా వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను ఒక నిరంతర యజ్ఞంలా నిర్వహిస్తున్న ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు ఎంతో శ్రమకోర్చి, అనేక పుస్తకాలను చదివి, ఎందఱో రచయితల నుండి, అంతర్జాలం ద్వారానూ, అనేక విషయాలను సేకరించి 'Yuvabharathi Personality Development Lecture Series pamphlets' పేర దాదాపు 12 కరపత్రాలను ఆంగ్లంలో తయారుచేసి యువతకు ఉచితంగా అందజేశారు. ఆ కరపత్రాలలోని సూక్తులను,సూత్రాలను తెలుగు పాఠకలోకానికి అందించాలనే సత్సంకల్పంతో డా.నాగినేని భాస్కరరావు గారు వాటిని అనువదించి,ఈ పుస్తకాన్ని అందించారు.

## 180. దివాకర ప్రభ




అవధానాలు చేసినా, భువన విజయాలు ప్రదర్శించినా, కావ్యాలు వ్రాసినా, కవితలల్లినా, పుస్తకాలకు పీఠికలు సంతరించినా, ప్రవచనాలు బోధించినా – ఆయన ప్రతి ప్రక్రియలోనూ, తనదైన శైలిని ప్రదర్శించిన వాంగ్మయ దివాకరులు – ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు. తెలుగు నాట సాహిత్యోపన్యాసం అంటే ఇలా ఉండాలని ఒక ఒరవడిని సృష్టించిన మహానుభావుడాయన. వినయం, సౌశీల్యం, పాండిత్యం మూర్తీభవించిన ఆచార్య దివాకర్ల వారి శతజయంతి సందర్భంగా, యువభారతి గౌరవాధ్యక్షులు, దివాకర్ల వారికి అత్యంత సన్నిహితులు, డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు, దివాకర్ల వారిపై నూట ఇరవై తొమ్మిది పద్యాలను కావ్యరూపంలో వ్రాశారు. ఆ చిరుకావ్యమే ఈ ప్రచురణ.

## 181. ప్రభావం




మహనీయుల చరిత్రలను పరికించి చూస్తే, వారికి ప్రేరణనిచ్చి, ప్రభావితం చేసి ముందుకు నడిపించిన వ్యక్తులు ఎందఱో కనబడతారు. ఛత్రపతి శివాజీ తన తల్లి జిజియాబాయి, గురువు సమర్థ రామదాసు ల వలన ప్రభావితుడైతే, రామకృష్ణుని బోధనలతో 'నరేంద్రుడు' వివేకానందుడై యావద్భారతదేశానికి దిశానిర్దేశం చేయగల సమర్థుడయ్యాడు. రాజరాజ నరేంద్రుని ప్రేరణతో ఆదికవి నన్నయ భారతాన్ని తెనిగించడానికి పూనుకుంటే, సాక్షాత్తూ ఆ శ్రీరామచంద్రుని ఆనతితో పోతన్న మహాభాగవత రచనకు ఉపక్రమించాడు. ఆధునిక తెలుగు సాహితీ జగత్తులో దిగ్గజాలవంటి డా. సి.నారాయనరెడ్డి, డా. దాశరథి, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీ వానమామలై వరదాచార్యులు, శ్రీ దేవులపల్లి రామానుజరావు వంటి ప్రముఖులు తమ జీవితంపై ప్రభావం చూపిన వ్యక్తుల గురించి, గ్రంధాల గురించి, యువభారతి మాసపత్రిక 'నందిని' కి అందించిన వ్యాస సంకలనమే – ఈ ప్రభావం పుస్తకం.

## 182. దాశరథి కవితా వైభవం



నా తెలంగాణ — కోటి రతనాల వీణ" అంటూ ప్రకటించి, నిజాం పరిపాలనలో తెలంగాణ దుస్థితినీ, ప్రజల ఇక్కట్లనూ గ్రహించి, నాటి ప్రభుతకు వ్యతిరేకంగా 'రుద్రవీణ' ను మీటి, సింహగర్జన చేసిన కవి కంఠీరవం దాశరథి కృష్ణమాచార్య. అటువంటి స్ఫూర్తిసుధాశరధి, దాశరథి జీవితాన్నీ కవిత్వాన్నీ కూడా రాబోయే తరాలకు పఠనీయంగా, ఆదర్శంగా నిలిచేలా డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు ఈ గ్రంధంలో వివరించారు. ఆయన జీవితంలో నిజాం నవాబుపై తిరుగుబాటు, జైలు జీవితం, విశాలాంధ్రకై చేసిన కృషి, ఆయన జాతీయ దృష్టి, వంటి అంశాల చిత్రణతో బాటు, దాశరథి కవిత్వంలోని ప్రబోధం, వర్ణనలు, ఆశావాదం, శాంతి ప్రియత్వం, లోకజ్ఞత, నిర్వచనాలు, చలనచిత్ర గీతాలు వంటి విషయాలను శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య గారు ఎంతో సరళ సుందరంగా, మధుర వ్యాఖ్యలతో సంతరించారు.

SCAN FOR E-BOOK

## 183. చొరవ: ప్రస్తుతం అందుబాటులో లేదు.

## 184. నగరం నిద్రపోదు



"నగరం నిద్రపోదు" అనడానికి శ్రీ నాగినేని భాస్కరరావు గారు ఎన్ని నిద్రలేని రాత్రులు ఆర్తితో ఆకళింపు చేసుకున్నారో గానీ, ఈ సంపుటిలో ఆయన చిత్రించిన నగర దృశ్యాలతో పరిచయంలేని నగరవాసి ఉండడు. ఈ దీర్ఘ వచన కవిత, హైదరాబాద్ నగర స్వరూప స్వభావాలను, ఇక్కడి జీవన సరళులనూ, సాగిన చారిత్రిక ఘటనా ఘటనలనూ అద్దంలో కొండను చూపినట్లు చూపిస్తోంది. నాణేనికి బొమ్మా బొరుసులా నగరం యొక్క మంచి చెడులూ, కష్ట సుఖాలూ, వెలుగు చీకట్ల పార్శ్వాలను సూటిగా బహిర్గతం చేశాడు. విద్య పేర, వ్యాపారం పేర, ఆరోగ్యం పేర, భక్తి పేర ప్రబలుతున్న అమానుషాలను, అమానవీయతను నిలదీశాడు.

SCAN FOR E-BOOK

## 185. మీ మార్గం మీ గమ్యం



మీరు ఉన్నతంగా ఎదగడానికి మీకు ప్రపంచం కావాలి. మీరు ఎదిగిన తరువాత ప్రపంచానికి మీరు కావాలి. ఐతే ప్రపంచం మీకోసం ఎదురుచూసేలా మీరు ఎదగాలి. ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు, శ్రీమతి GLK దుర్గ గారు సంకలనం చేసిన ఈ చిన్ని పుస్తకంలో మీ ఆత్మవిశ్వాసం పెంచుకోవడానికి, మీరు విజయవంతమైన జీవితాన్ని పొందడానికి కొన్ని సూత్రాలు, మరికొన్ని సూచనలు ఇవ్వబడ్డాయి.

SCAN FOR E-BOOK

## 186. వ్యక్తిత్వ వికాసం



వ్యక్తిత్వ వికాసం అంటే, మనలో ఏ ఒక్క అంశాన్నో అభివృద్ధిపరచుకోవటం కాకుండా, అన్ని అంశాలలోనూ సమగ్రమైన సంపూర్ణమైన అభివృద్ధిని సాధించడం. ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు, శ్రీమతి GLK దుర్గ గారు సంకలనం చేసిన ఈ చిరుపుస్తకాన్ని తక్కువ వెలకే అందరికీ అందజేయాలని, ఈనాటి యువతరం లబ్ది పొందాలని, యువభారతి ఆశయం.

SCAN FOR E-BOOK

## 187. Personality Development



యువభారతి స్ఫూర్తితో, మా సభ్యులలో ఒకరైన శ్రీ వేగ్నేష్ణ గోవిందరాజు గారు, వ్యక్తిత్వ వికాసానికి సంబంధించి నాలుగు బుక్‌లెట్‌లను తీసుకొచ్చి చాలా తక్కువ ధరలకు అందుబాటులో ఉంచారు. ఈ బుక్‌లెట్లలో నాలుగింటిని రచయిత ఆర్థిక సహాయంతో యువభారతి ప్రచురణలుగా విడుదల చేయబడ్డాయి.

SCAN FOR E-BOOK

## 188. You & Your life




యువభారతి స్ఫూర్తితో, మా సభ్యులలో ఒకరైన శ్రీ వేగ్నేష్ణ గోవిందరాజు గారు, వ్యక్తిత్వ వికాసానికి సంబంధించి నాలుగు బుక్‌లెట్‌లను తీసుకొచ్చి చాలా తక్కువ ధరలకు అందుబాటులో ఉంచారు. ఈ బుక్‌లెట్లలో నాలుగింటిని రచయిత ఆర్థిక సహాయంతో యువభారతి ప్రచురణలుగా విడుదల చేయబడ్డాయి.

SCAN FOR E-BOOK

## 189. గాంధీ మహాత్ముని సూక్తులు




భారతదేశ జాతిపిత మహాత్మా గాంధీ నూట యాభయ్యవ జయంతి సందర్భంగా, 150 గాంధీ సూక్తుల సంకలనమే ఈ చిన్ని పొత్తం. సూక్తి అంటే మంచి మాట. ఇవన్నీ వ్యక్తి సంస్కారాన్ని, సమాజ శ్రేయస్సును కోరి గాంధీ గారు చెప్పిన సూక్తులు. మన సంస్కృతిని ప్రతిబింబిస్తున్న ఈ సూక్తులు మానవ మూల్యాలను పెంచి, వ్యక్తి వికాసాన్ని కలిగించేవి. నేటి యువతకు మార్గదర్శకాలుగా ఉండేవి. వీటిలో మానవ మూల్యాలైన సత్యం, అహింస, సహనం, త్యాగం, ప్రేమ అనే గాంధీ గారి ప్రధాన సిద్ధాంతాలతో పాటు, నీతి, న్యాయం, కర్తవ్యం, తత్త్వం, మనస్తత్వం, మతం—సమ్మతం,ఆగ్రహం-నిగ్రహం అనే విషయాలకు సంబంధించిన సూక్తులు కూడా ఉన్నాయి.

SCAN FOR E-BOOK

## 190. గాంధీ సందేశ పథం




“కొంతమంది ఇంటిపేరో, ఊరికొక్క వీధి పేరో గాంధీ కాదనీ, కరెన్సీ నోటుమీదో, నడిరోడ్డు మీదో చూస్తున్న బొమ్మ గాంధీ కాదనీ, భారతమాత తలరాతను మార్చిన విధాతగా, తరతరాల యమయాతన తీర్చిన వరదాతగా, ఆకృతి దాల్చిన అవధూతగా..” సినీ కవి సిరివెన్నెల ఒక గీతంలో పేర్కొన్నట్లుగా “ఇలాంటి నరుడొకడిలాతలంపై నడయాడిన సంగతి నమ్మరాదని నమ్మకముండే” ముందుతరాలకు - మహాత్మా గాంధీ గురించి చెప్పవలసిన గురుతర బాధ్యతను యువభారతి స్వీకరించింది. వేలాది కవులు, కథకులు, నవలా రచయితలూ, గాంధీజీ వల్ల ప్రభావితులై సాహిత్య సృష్టి చేసి, ఆయన స్ఫూర్తిని, దీప్తిని అజరామరం చేశారు. మహాత్మాగాంధీ నూట యాభయ్యవ జయంతి సందర్భంగా, “దేశం-జాతిపిత సందేశం” అన్న అంశంపై యువభారతి నిర్వహించిన కవి సమ్మేళనంలో పలువురు కవులు, కవయిత్రులు పాల్గొని సమర్పించిన కవితా సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK

## 191. అమరుడు బాపూజీ




ప్రఖ్యాత పత్రికా రచయితా, తెలంగాణా రాష్ట్ర ప్రభుత్వ అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ దేవులపల్లి ప్రభాకరరావు గారు, గాంధీ మహాత్ముని జీవన ఔన్నత్యాన్ని, పరమార్థాన్ని వివరిస్తూ చేసిన ప్రసంగా పాఠమే – ఈ ప్రచురణ. ఈ గ్రంథంలో, శాంతి మార్గం, సత్యాన్వేషణ, అహింసాయుత సత్యాగ్రహోద్యమాలు, నైతిక మూల్యాలతో కూడిన గాంధీజీ విశిష్ట జీవన సందేశం గురించి వివరించబడింది.

SCAN FOR E-BOOK

## 192. తెలుగువారి పద్యాలు




తెలుగు పద్యానిది వెయ్యేళ్ళ వారసత్వం. పద్యానికి ధారణకు నిలిచే గుణం ఎక్కువ కావడంచేత, చిన్నప్పుడు చదువుకున్న భాగవత పద్యాలో, శతక పద్యాలో, వయసు పైబడినా గుర్తుంటాయి. పురాణాలు, కావ్యాలు చదువుకోని నిరక్షరాస్యులు సైతం, మౌఖికంగా విని, నేర్చుకుని, మననం చేసుకునే సౌలభ్యం పద్యానికుంది. తెలుగునాట జనం నాల్కలపై నడయాడిన అలాంటి నాటకపద్యాలు కొన్నింటిని వ్యాఖ్యాన సహితంగా వెలువరించిన గ్రంధమే – ఈ తెలుగువారి పద్యాలు. 'మహాభారత కౌరవరంగం', 'వేణీ సంహారం', 'శ్రీకృష్ణ తులాభారం', 'రామాంజనేయ యుద్ధం', 'సత్యహరిశ్చంద్రీయం', 'రామరాజ చరిత్ర', 'బొబ్బిలియుద్ధం' వంటి అపురూప నాటకాలలోని పద్యాలను ఈ సంకలనంలో రసవద్వ్యాఖ్య తో కూర్చి, శ్రీ విహారి గారు సరళసుందరంగా పాఠకలోకానికి ఉపాయనం కావించారు.

SCAN FOR E-BOOK

## 193. పుంభావ సరస్వతి పుట్టపర్తి




ఆయన సరస్వతీ పుత్రా బిరుదాంకితులు. కానీ సాక్షాత్తు ఆయన పుంభావ సరస్వతి. బహుభాషా పరశేష భోగి. తెలుగులో 'శివతాండవం' 'అగ్నివీణ' వంటి కావ్యాలను, సంస్కృతంలో 'శివకర్ణామృతమ్, 'మల్లికార్జున సుప్రభాతమ్' వంటి రచనలను, ఆంగ్లంలో 'Leaves in the wind', 'The Hero' వంటి రచనలను, 'అభయ ప్రదానము', 'ప్రతీకారము' వంటి చారిత్రిక నవలలను తెలుగుజాతికి అందించారు. ఇవికాక అనేక వ్యాస సంపుటులు, విమర్శనా గ్రంధాలు, వందలాది భక్తి సంకీర్తనలు, అనువాద గ్రంధాలు.. అపారకావ్య రచనాంబుధి పుట్టపర్తి నారాయణాచార్యులు. ఆయన శతాధిక గ్రంధ రచయిత. శ్రీ పుట్టపర్తి వారి చాటువులతో సహా, ఆ మహనీయుని జీవిత-సాహిత్య విశేషాలను క్లుప్త సుందరంగానూ సమగ్రంగానూ ఈ పుస్తకంలో తెలియజేశారు ఆయనగారి కుమార్తె, విదుషీమణి, శ్రీమతి పుట్టపర్తి నాగపద్మినిగారు.

SCAN FOR E-BOOK

194. అభినవ పోతన వానమామలై : ప్రస్తుతం అందుబాటులో లేదు.

## 195. తెలుగు సొగసులు




తోడుకొన్నవారికి తోడుకొన్నంత మాధుర్యాన్ని, భావ సౌందర్యాన్ని అందించే క్షీరసముద్రం - మన తెలుగు భాష. ఈ భాషకు ఎనలేని సిరిసంపదలుగా తులతూగుతున్న అపురూపమైన పదబంధాల గురించి, శ్రీ అల్లంరాజు వెంకటరావు గారు (సుధామ) వివరించారు. ప్రముఖ కవి, ఆకాశవాణి పూర్వ కార్యక్రమ నిర్వహణాధికారి, యువభారతి సంస్థ ప్రచురణల ప్రధాన సంపాదకులుగా సేవలందించిన శ్రీ సుధామ గారు, ఈ గ్రంథంలో సాహిత్యాభిమానులకు, సాహిత్యాధ్యయనం చేస్తున్న విద్యార్థులకు పనికివచ్చేటట్లు తెలుగు భాష సొబగులను పరిశోధనాత్మకంగా పరిశీలించి వివరించారు.

SCAN FOR E-BOOK

## 196. విజయ పథం




ఉన్నత కీర్తి శిఖరాలను అధిరోహించిన ఎందరో మహానుభావులు ప్రవచించిన, ఉత్తమ మానవ వ్యక్తిత్వ నిర్మాణానికి దోహదపడే -వందకు పైగా అంశాలపై వేయికి పైగా సుభాషితాల సంకలమే ఈ పుస్తకం. శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారు సంకలనం చేసిన ఈ సూక్తిసుధలు యువతకు వాక్సిన్ లా పనిచేస్తాయని, ఆరోగ్యదాయక సమాజాన్ని ఈ తరం కలసికట్టుగా సాధించాగాలదనీ యువభారతి ఆకాంక్ష.

SCAN FOR E-BOOK

## 197. నేర్పుగా జీవించడం ఎలా




నేడు జీవనసరళిలో వేగం పెరిగిపోతోంది. ప్రమాణాలు తగ్గి పోతున్నాయి. విలువలు పడిపోతున్నాయి. సాంకేతికంగా ఎన్నో విజయాలను సాధిస్తున్న మనిషి భూమిమీద మాత్రం, తనది కాని జీవన విధానానికి వశుడైపోతూ, సంఘర్శనాయుతమైన పరిస్థితుల్లో, అనారోగ్యం, అశాంతి పాలౌతున్నాడు. శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ గారు ఒక విషయం గురించి కుతూహలం కలిగించి, పఠితను సమాయత్తం చేసి ఆ విషయాన్ని సరళమైన శైలిలో, గాఢమైన, సునిశితమైన అభివ్యక్తితో, అర్థమయ్యేలా చెప్పడంలో సిద్ధహస్తులు.

SCAN FOR E-BOOK

## 198 & 199. చేగొండి కథా కదంబం (రెండవ & మూడవ భాగాలు)




యువభారతి సీనియర్ సభ్యులు, శ్రీ చేగొండి రామజోగయ్య గారి కథల సంపుటిని ఇదివరలో యువభారతి ప్రచురించింది. ఇప్పుడు ఆయన సమాజంలోని వివిధ అంశాలకు సంబంధించిన పలు కోణాలను స్పృశిస్తూ చక్కని కథలను అందించారు.

SCAN FOR E-BOOK

SCAN FOR E-BOOK

## 200. అమృత భారతి




భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా 1947 నుండి 1972 సంవత్సరం వరకు – ఈ పాతికేళ్లలో తెలుగు సాహిత్య ప్రస్థానం పై లబ్ధప్రతిష్ట కవి, పండిత, విమర్శక, పరిశోధకుల చేత వ్యాసాలను సేకరించి "మహతి" ప్రచురణను తీసుకురావడం, అది ఆనాటినుండి ఈనాటి వరకు బృహత్తరమైన అద్భుత గ్రంధంగా సాహితీ ప్రియుల మన్ననలను అందుకొంటూనే ఉంది. ఇప్పుడు భారత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా - 1972 నుండి 2022 వరకు ఈ ఐదు దశాబ్దాలలో దేశంలో చోటు చేసుకున్న సామాజిక రాజకీయ పరిణామాలతో పాటు, తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియలు, ఇతర నూతన అంశాల గురించి ఈనాటి ప్రసిద్ధ కవి, పండిత, విమర్శక, పరిశోధకుల చేత వ్యాసాలను వ్రాయించి మీకు అందించిన వ్యాస సంకలనమే ఈ పుస్తకం.

SCAN FOR E-BOOK